# ఆనందవల్లి

ఉపదేశాత్మక కథలను
గుదిగుచ్చి చెప్పిన
రసవత్తర కావ్యము



గాడేపల్లి కుక్కుటేశ్వరరావు

# ఆనందవల్లి

## ఉపదేశాత్మక కథా కావ్యము

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారు అందించిన
ఆర్థిక సహాయ మూలమున ప్రచురింపఁబడినది.
(R. O. C. No. Edit. 5/1513/94 dt. 20-4-96)

కవి : గాడేపల్లి కుక్కుటేశ్వరరావు, ఎం. ఏ.
అష్టావధాని
(Retd) Lecturer and Principal (F. A. C.)
A. P. Government Degree Colleges.

ప్రచురణ : డిసెంబర్ 199[illegible]

ప్రతులు : 1000

వెల : రూ. 35/-

ప్రాప్తిస్థానము :
జి. కుక్కుటేశ్వరరావు
ఇం. నం. 79-18-2,
ఓంకారవీధి, శ్యామలానగర్
రాజమండ్రి
పిన్. 533 103



ముఖపత్ర చిత్రణ :
శ్రీ నగేశ్
తారా ఆర్ట్స్, రాజమండ్రి

ముద్రణ :
శ్రీ నందకిషోర్ ప్రింటర్స్
ఆర్యాపురం, రాజమండ్రి

అట్ట ముద్రణ :
ఈశ్వర్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్
రాజమండ్రి

# కృతిపతి

గుంటూరు మండలాంతర్గత

పెదనందిపాడు గ్రామ సమధిష్ఠిత

త్రిపురసుందరీ సమేత

శ్రీ సోమేశ్వరస్వామివారు

దైవమనిన, మంత్రతత్త్వమ్మనిన, పున
ర్జన్మమనిన, తపము జపము లనిన,
కర్మమనినఁ బ్రజకుఁ గల నమ్మకమె 'సమా
జస్పృహ'గ ఘటించి సల్పుదుఁ గృతి.

# ఈ కావ్యాన్ని గురించి ఒక్క మాట

సాధారణంగా ఏ కావ్యం ఆవిర్భవించడానికైనా మూలకారణం ఆ కవికి స్వతస్సిద్ధంగా ఉండే ఆత్మానందం అనే అనుభూతి. 'ఈ కవిత బాగా చెపుతున్నాను' అని తనకు తాను ఆనందిస్తూ కవి, కవిత అల్లుకుపోతాడు; కావ్యం పూర్తి అవుతుంది.

ఆ కవిత్వాన్ని వినో చదివో తనలాగా ఆనందించగలిగే మిత్రుల ముందు అనంతరప్రయత్నంగా ఆవిష్కరిస్తాడు. వారు కూడా 'బాగుంది' అని తల ఊపితే చేసిన ప్రయత్నం ఫలించిందని ఆనందపడతాడు కవి.

కవి, సహృదయుల ఆనందమే కావ్యగుణానికి గీటురాయి. వ్రాస్తూ నేను ఆనందపడ్డాను, వింటూ మిత్రులు ఆనందించారు. అందుకే ఈ కావ్యానికి ఆనందవల్లి అని పేరు పెట్టాను.

ఆనందంతోపాటు ఉపదేశం కూడా ఇచ్చే కావ్యం కావడం సమాజానికి క్షేమకరం. ఆ ఉపదేశం సర్వజనానికి, సర్వకాలాలకు ఆమోదయోగ్యంగా ఉంటే మంచిది. ఈ కావ్యంలో నేను గుదిగ్రుచ్చిన కథలూ సన్నివేశాలూ ఏదో ఒక ఉపదేశాన్ని అందిస్తాయి. పురాణ గాథలవంటివితప్ప ఇందులోని చాలా సన్నివేశాలు నేను కళ్లారా చూచినవి, విన్నవి; పురాణ కథలను మళ్లీ చెప్పవలసి వచ్చినప్పుడు సమయసముచితంగా కొద్దిపాటి కల్పనచేశాను. అదికూడా ఉపదేశకత దృష్టిలో పెట్టుకొనే.

మన సంప్రదాయతత్త్వానికి సన్నిహితంగా నడచిన రచన ఇది. భారత భాగవత గ్రంథాలలో నేను చదివిన కొన్ని కొన్ని అంశాలకు తర్కసహమైన వివరణ ఇచ్చాను.

కావ్యం చదవగలవారు చదువుతారు. చదివినవారు, చదవలేని వారికి ఇందులోని విశేషాలు చెప్పి నా కృషిని సఫలీకృతం చేస్తారు.

—గాదేపల్లి కుక్కుటేశ్వరరావు

# కృతజ్ఞత

కావ్య ముద్రణకు సాయపడిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారికి—

కావ్యంలోని ప్రతి అక్షరమూ మనసుపెట్టి చదివి, బాగున్నదని మెచ్చుకొని, అక్కడక్కడ శబ్దసాధుత్వ విషయికమైన సూచన లిచ్చిన మా చిరకాల మిత్రులు, పెద్దలు, డా॥ జొన్నలగడ్డ మృత్యుంజయరావు గారికీ—కృతజ్ఞతలు.

కావ్యం అచ్చువేస్తున్నానని విని—

అత్తిలి శ్రీ వల్లీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి డిగ్రీ కళాశాలకు ప్రిన్సిపాల్‌గారైన మిత్రులు శ్రీ యం. సూర్యనారాయణ గారు రూ. 1116/– లు పంపారు.

'నా చేయి కూడా కొంచెం పడనివ్వండి' అని రూ. 116/– అందించారు మా సహాధ్యాపక మిత్రులు డా॥ ధవళ వెంకటేశ్వరశర్మగారు.

'మీ కావ్యంలో ఏదైనా ఒక కథ వినిపించండి' అని అగిడి మరీ విని వెళ్లి, రూ. 250/– లు పంపించారు—రసజ్ఞులు, పెద్దలు, భగ్గేశ్వరం గ్రామస్థులు, నేనంటే ఎంతో అభిమానం ఉన్నవారు శ్రీ యస్. కోటేశ్వరరావుగారు.

వీరి అందరికీ కృతజ్ఞుణ్ణి.

ఇక ముద్రణ కార్యక్రమంలో నాతోపాటు తిరిగి శ్రమించి అన్నివిధాలా చేదోడుగా నిల్చినవాడు మా బావమఱది చి॥ సన్నిధానం నరసింహశర్మ — ఆశీర్వదిస్తున్నాను.

—కుక్కుటేశ్వరరావు

# విషయసూచిక

# ఆనందవల్లి

## ప్రథమాశ్వాసము : కందము

-: దేవతా స్తవము :-

ఓం ప్రథమంబున నెవఁడు స్వ
యం ప్రతిభాలీల నద్భుతాద్భుతమగు నే
వం ప్రకృతిని సృష్టించెనొ
సం ప్రీతిన్ దన్మహత్త్వ స్తవ మొనరింతున్. 1

తెల్లనిమేను, మేనికిని దెల్లని వస్త్రము, వస్త్రకాంతికిం
దెల్లని హంసవాహనము, తెల్లని నవ్వులు, తెల్లయెల్లెడం
దెల్లముగాఁగ సత్కవి సుధీగృహసీమల కెల్లవేళలన్
జల్లఁగ వచ్చి పోవు దొరసానికి మ్రొక్కెద బ్రహ్మరాణికిన్ 2

మా యిలు కాపు పార్వతమ, మాదృగనాథులు పిల్చినంతనే
'యో'యనివచ్చి యాదుకొను నుత్తమురాలు, సమస్తదేవదే
వాయతనంబులన్ నిలిచి యర్చనలందెడు పెద్దదిక్కు, దీ
ర్ఘాయు రనామయత్వములకైఁయి మోడ్చినుతింతు నాయమన్ 3

ఏ లేమి లేకపోవుట
యే లేమి, మఱేమె కల్మి యే కల్మి యగున్
భూలోకమ్మున కా ల
క్ష్మీలలన కటాక్షమెపుడు చిందుత మాపై 4

గణనాథు, విఘ్నరజనీ
దిననాథు ననాథనాథు దివిజ సనాథున్
బ్రణుతింతు జననమరణ
వ్రణవైద్యు నభేద్యు భక్తిభావన వేద్యున్ 5

శ్రీ సూర్యప్రభుఁ డన్న దర్శకుఁడు ప్రార్థిశ్రేణీ సంరక్షణ
వ్యాసంగుండు కృపాపరుండు నిఖిలబ్రహ్మాండ జీవాణు వు
ల్లాసాపాది యనాది యాత్మరుచి లీలాధావిత ధ్వాంతవి
న్యాసుండెప్పుడు నన్ శుభేక్షణములన్ గన్పట్టి కాపాడుతన్ 6

ననుఁబడకుండఁ బట్టుక యనంత విహాయసవీథి సూర్యదే
వునకొక వత్సరంబునకుఁ బూనిక నొక్క ప్రదక్షిణంబుగా
నెనరునఁ ద్రిప్పి నాకటులనేఁటికి నేఁబదియాఱిన ప్రద
క్షిణములు చేయఁ దోడ్పడిన శ్రీమహిదేవికి నేఋణస్థుఁడన్ 7

క్రమమున వేదవిద్యలఁ బురాణములన్ బహుతత్త్వ ధర్మశా
స్త్రములను, గావ్యనాటక పరంపరఁ గంఠములందు తాళప
త్రములన నిల్పి వాఙ్మయము రక్షయొనర్చిన తొంటిబ్రాహ్మణో
త్తములను మౌళిదేశ ఘటితంబగు నంజలిఁ బ్రస్తుతించెదన్ 8

ఛందస్సుందర సత్కవిత్వబల శశ్వద్రక్షితాంధ్ర ప్రజా
బృందుల్ నన్నయదొట్టి సత్కవులు, వారేనాఁడొ యాదిత్యులై
యుండుర్ నిశ్చయ మావహించినను నీయుద్యోగ మీడేర నా
యందావంత యనుగ్రహంబు నిలుపం బ్రార్థింతు నమ్రుండనై 9

వ, ఇట్లు దేవతా బ్రాహ్మణ దీసుత్ప్రార్థనంబు గావించి యీషత్సంప్రదాయానుయాయి నయి నా విరచింపం దొరకొన్న యానందవల్లి పేరింటి చిన్న కబ్బంబునకుఁ జిరకాలంబుగా మాయూర నధివసించి రక్షించుచున్న శ్రీ సోమేశ్వరస్వామివారి నధిపతిగా సంకల్పించితి. 10

నేఁ బుట్టిపెరిఁగి తగు వి
ద్యాబుద్ధుల నభ్యసించి యష్టవధాన
ప్రాభవముఁ గనిన మా గా
రాబపుఁ బెదనందిపాడు గ్రామము నెంతున్ 11

పెదనందిపాడు హిమభువి
పెదచెఱువదె మానసంబు పృథుతరతటి మ
య్యదె కైలాసంబందొ
ప్పిదుఁడగు సోమేశ్వరుండె వెలయు శివుండై 12

ఆ సోమేశ్వరుఁ డార్తరక్షణ తదేకాచార నిష్ఠాసము
ల్లాసుండాశ్రిత కల్పభూమిజము భోశ్శంకరుండొక్క వి
శ్వాసంబుంచి నమస్కరించిన ఫలప్రాప్తుల్ ఘటింపంగ తా
నే సర్వార్థ సమర్థుఁడా ప్రభునకే నీఁకంటి మత్కావ్యమున్

వ. దేవా! కృతి నవధరింపుము! 14

## కథా ప్రారంభము

### -: బ్రహ్మవేత్త స్వగ్రామము చేరుట :-

బ్రహ్మవేత్త యను నుపాధ్యాయుఁ డొక్కఁడు
తెనుఁగు పుడమినెల్లఁ దిరిగి తిరిగి
వచ్చిచేరె ముదిమి స్వగ్రామమున కద్దిఁ
గడపు జీవితంబు గడపు కొఱకు 15

ఆపల్లెం గలవెన్నియో కులము లయ్యెవర్ణ సంజాతు ల
న్నా పిన్నమ్మ! మఱంది!బావ!వదినా!యక్కా!యటంచాత్మబం
ధాపేక్షల్ చివురింపఁ బిల్చుకొనుచుం దన్యోన్య మాయా బహు
వ్యాపారంబులఁ బ్రొద్దుపుచ్చుచును లబ్ధశ్రీసదాత్మప్రవృత్తులై 16

-: గ్రామస్థులు జిజ్ఞాసువులై బ్రహ్మవేత్త నాశ్రయించుట :-

ఆయూరంగల పెద్దలొక్క దిన మయ్యభ్యాగతుఁడౌ నుపా
ధ్యాయుంబూజ్యుని బ్రహ్మవేత్తఁగని యయ్యారేబడుల్ పెట్టిపా
కాయాయక్కరముల్ లిఖింపఁగల నేర్పభ్యస్తముంజేసి రెం
తోయుండంగలదంచుఁ బుస్తకములందున్దోఁచు యోచించుచో 17

మాకు వచ్చినట్టి యీకొద్ది చదువుతో
భారతమ్మొ లేక భాగవతమొ
చదువుకొనఁగనేర మది యథార్థము, కాని
యేదొ కొంత యెఱుఁగ నిచ్చగలదు 18

మీరెన్నెన్నో చదివిన
వారై యుండెదరు, కాక వాస్తవలోకం
జేరీతి నుండె నెఱిఁగిన
వారై యుండెదరు దేశపర్యటనముచే 19

కావున మేమెఱుంగఁదగు గాథలు, వింతలు, మంచి చెడ్డ ల
య్యెయ్యె విపులప్రబోధముల నానతి యిండని వేడికొన్న స
ద్భావతరంగితాత్ముఁడయి వారికి నిట్లనె బ్రహ్మవేత్త మీ
కే వివరింప నేరిచిన దెంత? రవంత, రవంతె తెల్పెదన్ 20

అని గ్రామస్థులఁ జేరఁదీసి ప్రతినిత్యం బర్థి సాయంతనం
బున నాచెలగటి రామమందిరమునన్ బుణ్యప్రసంగంబు సే
యను సిద్ధంపడె బ్రహ్మవేత్త తగువా రచ్చోటికిఁజేరి మీ
టిన వేడ్కన్ గ్రహియింప నగ్గురువచశ్శ్రీరమ్య ధర్మార్థముల్ 21

ఆ వృద్ధాదులు శౌనకాదిమునులై యత్యంత కౌతూహల
శ్రీ వించుండఁగ బ్రహ్మవేత్త యభివర్ణించుం జమత్కారవా
చావైదగ్ధ్యము మీఱ శ్రోతృ సుమన స్సంతోషణాశేషభా
షావిశ్లేషిత సాధుగాథల నజస్రం బుత్సుకత్వంబునన్ 22

ఒకపరి బ్రహ్మవేత్త తనయొద్ద మెలంగెడు పెద్దలంబ్రియా
త్మకముగఁ బల్కరించుచటు మాటలసందడి "మీకెదేని యిం
చుక తెలియం దలంపయగుఁచో నడుగుండువచింతు" నన్నదా
నికి నగి యొక్కతాత గురునిందగ నిట్లడిగెన్ బుజూక్తులన్ 23

:- చెట్టు విత్తనములలోఁ జెట్టె ముందు :-

వ. "చెట్టుముందా విత్తుముందా? యని మాతాత మమ్ములఁ
జిన్నతనంబునం బ్రశ్నించుచుండె. అప్పుడా ప్రశ్నం బర్థ మపా
ర్థములేని పరిహాస వాక్యంబుగా లెక్కించితిమి. ఇప్పుడనుభవముచే
నది తెగని గడ్డు సమస్యగా భావింపంబడుఁ దెలిసితిరేని దీనిముడి
విప్పి మాకుఁ గనువిప్పు గావింపుఁడు!" 24

అనవుడు బ్రహ్మవేత్త "యిది యంతటి గడ్డుసమస్యకాదు, దీ
నిని దెలియంగ సృష్టిసరణిం దెలియంగవలెన్ వినుండి! యా
దిని నిఖిలస్థితుండయిన దేవుఁడు విష్ణువె యుంఁడె నమ్మహా
త్ముని వికృతుల్ వియత్పవనతోయశిఖిక్షితు లన్న భూతముల్ 25

క్షీర వికృతులెకద నీరమ్ము, మీఁగడ
వెన్న, నేయి, చల్ల యన్నయైదు
అట్లె విష్ణు వికృతు లప్పంచ భూతమ్ము
లందు నీరు కేంద్ర బిందువయ్యె 26

నీరములె వసతియై హరి
నారాయణుఁ డయ్యెనతని నాభికమల మం
దారూఢమైన నళినీ
చారూపర మందు బ్రహ్మ జననం బందెన్ 27

జననంబందిన బ్రహ్మకన్దెఱచి పార్శ్వస్థావకాశంబుగ
న్గాని తానెవ్వఁడొ పద్మపత్రముల యందుంజిక్కి కూర్చుంటినో
ట్లో! నిజోద్యోగమదేమొ సర్వమునగమ్యోదంతమై దీర్ఘ చిం
తననట్లే బహుకాల మొంటరితనాసన్ బుచ్చెఁ గూఢోడ్డుపై 28

ఒకసమయాన బ్రహ్మకొక యూహ జనించెఁ దదంబుజాతనా
ళికడిగిపోవఁబోవ మొదలింటి నిజోద్భవ మూలకందమొ
ద్ధికఁ దెలియంగనేర్తునని, దిగ్గఁగడంగి చనంజనంగ నెం
తకుఁ దుదిలేనియాత్రయయి తా మరలెంబయికిన్ నిరాశుఁడై 29

ఒక్కనాఁడు వారిజోద్భవు శ్రుతివీధిఁ
దవిలి వినఁగవచ్చెఁ "దపతప!" యను
వాక్య, మెవరొ నను దపం బొనరింపఁగాఁ
బలుచు చుండి రనుచు బ్రహ్మ తెలిసి 30

తపమునకుఁ బూని యేకా
గ్రపు నిష్ఠానియమ నిర్వికారతఁ బెక్కేం
డ్లపరిమిత ధ్యానాబ్ధి
న్నపితుండై యుండ నాకసంబునఁ దోఁచెన్ 31

జలధిశాయి, చరణసన్నిధి శ్రీదేవి,
శంఖ చక్రఖడ్గ శార్ఙ్గ గదలు,
సైనతేయ విహగ వైకుంఠపురము ల
య్యబ్జభవున కద్భుతావహములు 32

వ. అట్లు తోఁచిన జలధిశాయి బ్రహ్మ కిట్లనియె 33

నాయన! నేనె నిన్ దప మొనర్పఁగఁ బంచిన వాక్యకర్త నా
రాయణ సంజ్ఞుఁడన్ ద్వదుదయంబున కాస్పదమైనవాఁడ, నీ
ధీయుత చాతురీశుభమతిన్ సృజియింపు మనంత జీవజా
లాయతవస్తు విస్తర మహాద్భుత భూతవిశిష్ట విశ్వమున్ 34

అని దేవుండానతి యీ
వనజభవుం డట్టి సృష్టిపని కెవ్వరి నే
వినియోగింతునొ యని యొక
క్షణమాలోచించి శివుని సామర్థ్యంబున్ 35

మదినిలిపి, యపుడ శివ స
న్నిధి సంకల్పించుకొనిన నెఱి నీశ్వరుఁడున్
ముదమునఁ బ్రత్యక్షంబై
కదిసిన నీశ్వరుని పద్మగర్భుఁడు పొగడెన్ 36

దానికిఁ బ్రీత చిత్తుఁడయి తత్పరమేశ్వరుఁ డోజతేజ సం
తానుఁడు! యేమి కావలయు నావలనన్ వివరింపు మన్న నీ
శానుని బ్రహ్మ వేఁడికొనె "స్వామి! సమర్థులు మీరు, సృష్టికిం
బూనుఁడు! నాదు కార్యభరముం దగఁదీర్పుఁడు నేర్పు సంధిలన్ 37

అనుచు విరించి వేడ శివుడాదృతి నిట్లనె "నెట్టికష్టపుం
బనియు(?)దపోమహత్త్వబల పర్యవసానముగాఁ గడించి కో
ననువగుఁ గాన నేఁటిదె మహాజల మధ్యమునం దపఃక్రియం
గొని సఫలీకృతుండనయి కూర్మి ఘటింతుఁ ద్వదీప్సితార్థమున్ 38

అని శివుఁడు తపమునకుఁ జనె
వనజ భవుండుండె భవుని ప్రత్యాగమ పు
ణ్య నిరీక్ష- దీర్ఘ కాలము
చనుచున్నదె కాని రాఁడు శంభుఁడు మగుడన్ 39

బహుసహస్రవర్ష పర్యంత మాబ్రహ్మ
వేచిచూచి వేచిచూచి చూచి,
నిజతపః ప్రభావనియతి సృజనదక్షు
దక్షుఁడనెడి యొక్కతని సృజించి 40

వ. "ఇదె సత్త్వ రజ స్తమంబు లను గుణత్రయంబు, ఇది స్త్రీ పుం నపుంసకంబులను లింగత్రయంబు, ఇయ్యాఱింటిని మూల ద్రవ్యంబులుగా గ్రహించి సృష్టి కల్పింపుము!" అని విరించి యాజ్ఞాపించిన వినయాంచితుఁడగు దక్షుండు బ్రహ్మకిట్లనియె. 41

"నాకంటె నధికుఁ డన్యుఁడు
లేకుండిన నట్టి సృష్టిలీలను సేసై
చేకొనుట చెల్లు నరయుఁడు
నాకంటెను నధికుఁడుండి నాఁడేమొ ప్రభూ!" 42

అనిన "నీకంటెఁ బ్రస్తుత మధికుఁడౌరుఁడు
లేఁడు సృష్టింపుమనియె జలేజభవుఁడు
దేవ దానవ మానవ తిర్యగభిధ
జీవతతి దక్షుఁడపుడు సృష్టించి విడిచె 43

ఆదేవాది సమస్తజీవి సముదాయంబెచ్చియంతంతకున్
వేధోండంబును నిండి మెండగు క్షుధాపీడన్ భరింపంగ లే
కా దక్షున్ నిజసన్నిధానచరు స్వాహా చేయ సంసిద్ధమై
మీఁదన్ మీఁదికి దూఁక దక్షుఁడు భయోన్మేషంబునం బర్వి డెన్ 44

పర్విడి "పాహిపాహి" యని బ్రహ్మపదంబులఁబడ్డధాతయున్
సర్వమెఱింగి దేవ దనుజవ్రజ మానవ తిర్యగాళి హృ
త్పూర్వముగా భుజింపను లతాతరుగుల్మ విశేష వృక్షముల్
పర్వతభూతలాంబునిధులన్ సృజియించి వచించె నివ్విధిన్ 45

ప్రాణులార! మీకు నాహార మీ లతా
గుల్మ వృక్షవితతి, కుడిచి మనుఁడు
వాని, వాని వలనఁ బ్రభవించు దళఫల
కందమూల శాఖికలఁ జివుళుల 46

అంతియేకాక దుర్బల ప్రాణు లధిక
తరబల ప్రాణుల కిల నోగిరము నగుత!
నియతిఁ జేసితి ననఁ బ్రాణినిచయ మపుడు
దక్షు విడి వృక్షభక్షణాపేక్ష నరిగె 47

కావునఁ జెట్టే మొదలిటి
దా వెనుకనె విత్తు సృష్టియందని సభ క
క్కొవిదుఁడు పురాణ ప్ర
స్తావన గొనివచ్చి తెలిపెఁ దజ్జులు దనియన్ 48

పిమ్మట శ్రోత్రితలందుఁగల పిన్న యొకం డడిగెన్ "మహేశ్వరుం
డమ్మెయి సృష్టికార్యఘటనాభిమతంబునఁ దోయరాశి మ
ధ్యమ్మునఁ జొచ్చి ఘోరతప మట్లొనరించుచు నుండెనంటి రా
యెమ్మెల సొమ్ములాఁ డివల కింతకు వచ్చెనొలేదొ చెప్పరే! 49

దానికిఁ బ్రహ్మవేత్త నగి "తచ్చరితంబె వచింతు నట్టులీ
శానుఁడు కోటివర్షములు సల్పి తపంబు, జలంబు వాసిరాఁ
గా నగుపించె భూస్థలి నఖండ మపూర్వమునైన సృష్టి సం
ధానము, దానికిన్ శివుఁ డెదంగడు విస్మయమంది యిట్లనెన్ 50

'ఓ వనజ ప్రసూతి! యెటనుండి సముద్భవమయ్యె నింతలో
నీ వివిధాకృతి స్ఫురదనేక గుణాత్మక జీవజాల మీ
భూవలయంబుపై' ననిన మోమరవాంచి విరించి 'యెంతకున్
మీ వెలరాకఁ గానమిని నేనొక దక్షు సృజించి కోరితిన్ 51

నా కోరికెపై నా తం
డీ కరణిన్ సృష్టిఁజేసె నీశ్వర! నన్నుం
బ్రోకట కరుణా దృష్టిని
సాకవె" యని బ్రహ్మ శివ ప్రసన్నత వేఁడెన్ 52

శివుఁడు ప్రసన్నుఁడై "శుభము! సృష్టిఘటిల్లెఁ ద్వదాత్మశక్తియ
ప్రవిహతమై యజుండ!" యని గ్రక్కున నీశ్వరుఁ డాత్మలింగమున్
దివిచి పడంగవైచె భువి, నేర్పునఁ దోఁక నొకొక్కయష్టబ
ల్లి విడిచివైచు వింతసరళిన్ ద్రిదశాదులు పిచ్చలింపఁగన్ 53

"ఈ లింగాంగము సృష్టి నిర్వహణకై యే సర్వశక్త్యాత్మకం
బౌ లీలన్ నియమించి తెచ్చినది, సృష్ట్యారంభమైపోయె నిం
కేలా? దీన నిఁకే ప్రయోజన"మటం చీశుండు వాక్రుచ్చి ని
ర్వేలాలోల తపఃక్రియన్ గడపఁజేరెన్ శ్రీమహేంద్రాద్రికిన్ 54

అపుడు బ్రహ్మ "యైనదై పోయె నీ జీవ
జాల మెప్పుడేని సమయవలయు
నట్టి పనికి రుద్రు నర్థింతు వెండియు"
ననుచు దిద్దుకొనియెఁ దన దొసంగు 55

-: దేవ దానవ తత్త్వ నిర్ణయము :-

ఆ చరితము విని యొక్కం
డాచార్యుల మరల నిట్టు లడిగెను 'తద్దే
దోచిత గుణతత్త్వము దై
త్యోచిత గుణతత్త్వ మెట్టులుండుఁ దెలుపరే!' 56

వ. దానికి బ్రహ్మవేత్త లిట్లనిరి 57

సందేహంబు తొలంగు దీనివినుఁడీ శ్రద్ధన్, బుధుల్ భాస్కరా
నందస్వామి యొకప్పుడొక్క సభలోనన్ దేవదైత్యాంతరం
బుందృష్టాంత పురస్సరంబు కథనంబుంజేసె విన్పింతు దా
నిం, దెల్లంబగు మీకె దేవదనుజానీక ప్రభేదాంశముల్ 58

అమృతలబ్ధి కొఱకు నమరులు నసురులు
క్షీరసాగరమును జిలికి నపుడు
పొడమి నట్టి యమృతమును జగన్మోహిని
దేవ పక్షమునకె త్రావఁ బోసె 59

అమృతము దక్కనట్టి యసురావళి రుద్రుదు సమాశ్రయించి మా
నము, క్రుధ, రోష మీర్ష్యలు పెనంగొన నిట్లనె 'దేవదేవ! మో
సము జరిగెన్ జనార్దనుఁడు చక్కని చుక్క విధానవచ్చి దు
ర్భ్రమలకుఁ బాలుచేసి మముఁ బంచె సమస్తసుధన్ సురాళికిన్ 60

అతఁడు మీకుఁ జుట్టమైపోయె నెదిరించి
యందమన్న మాకు ననువు గాదు
అతఁడిచ్చు కొలఁది యాడించుచున్నాఁడు,
ఆడుచుంటి మేము ననదలమయి 61

ఆపలుకుల్ మహేశ్వరు హృదంతర మందొక ముల్లుగ్జయై
రేఁప, రమాధి నాథుఁ డొనరించిన మాయ గ్రహించి తీవ్ర మౌ
కోపమువచ్చి "రం డసురకుంజరులార! వికుంఠధాము నా
క్షేపణపెట్టి తత్సుధను జీలిచి మీకునుఁ బంచఁజేసెదన్" 62

అని రుద్రుం డుగ్రుండై
దనుజులఁ దనవెంటఁ గొని యదాటున వైకుం
ఠనగరిపై వెడలిన వా
రిని గని నారాయణుండు ప్రియమెసలారన్ 63

వచ్చిన వారికెల్ల సదుపాయములన్ విడిదిండ్లఁ డిండ్ల తే
యచ్చరపూవుఁ బోండ్ల మధురాసవముల్ గలగిండ్లఁ బండ్ల జల్
మచ్చికనంచ రెక్కల నమర్చిన పాన్పులఁ బట్టుదిండ్ల, గో
ర్వెచ్చని నెత్రిటంబళుల వే సమహూరిచి పత్కొహాలితో 64

"తమ రాక చేత వైకుం
ఠము నేఁడు కృతార్థమయ్యె, నాచే సే య
ర్థము గోరి యిందటీ చం
దమునన్ దయచేసితిరొ గదా!" యనహరుఁడున్ 65

నీ యతివినయమ్ములు న
న్యాయము లిఁకఁ జాలు నేల యమృతము సమతన్
బోయ వసుదు లన నెవరని
నీయూహ? మదీయ భక్తనివహము వీరల్ 66

క్షీర జలధిఁ ద్రచ్చుచో రేఁగి వచ్చిన
హాలహల మదెల్లఁ గ్రోల నేను
అమృతరస మదెల్ల నారగింపను మీరు-
చెల్ల వింక నిట్టి చేష్టితములు 67

ఇప్పుడె యిక్కడకే సుధఁ
దెప్పింపుము! సురలతోడ దితిజుల నెల్లన్
దప్పక త్రాగింపుము! ని
న్నప్పుడె సమబుద్ధి యనుచు నభినందింతున్" 68

వ. అని రుద్రుండు నింద వెట్టిన విష్ణుండు 69

అమృతము తెండు పొండని భటావళిఁ గొందఱఁబంచి యట్టులే
యమరులఁ దోడితెండనుచు నంపెను గొందఱ, వారువీరు శీ
ఘ్రము కొనితెచ్చిరా కపిదపఁ గంజదళాక్షుఁడు తన్నివాస సౌ
ధమునఁ గట్టి మండపపథంబును రెండుగఁ జీల్చినట్లుగన్ 70

తెఱఁ గట్టించెను దైత్యులొక్కదెస నాదిత్యవ్రజంబొక్క ది
క్కురహిన్ బ్రాహ్మణ భోజనావసర పంక్తుల్ దోఁపఁగూర్చుండిరా
హరి బంగారపుఁ బానపాత్రములనయ్యేవారి ముందుంచి "యె
ల్లరకుం బోసెద నీసుధన్ వినిమదాలాపంబు క్రోలందగున్" 71

వ. అని వెనువెంట నిట్లని చెప్పం దొడంగె 72

పోసిన యమృతము నాత్రము
గా సొపడఁ జూతురేని గ్రక్కున విషమై
వే సంహరించుఁ దాత్రివం
జేసన్నయొనర్తు నపుడు చేకొనుఁడు సుధల్ 73

దాని కంగీకరించె దైత్యవర్గంబు
దేవబృందము, లరత మంత్రించి విష్ణుఁ
డిరు తెఱంగులవారి ముందరఁ గలట్టి
పాన చషకాల నమృతద్రవంబు పోసె 74

వ. పోసియొక్క చమత్కృతి సంకల్పించి 75

త్రావుండని చేసన్న మ
హా విష్ణుండొసఁగె, వేగ నటుదైత్యు లిటున్
దేవత లమృతపు గిన్నెల
వావిరి గ్రహియించి క్రోలఁ బై కెత్తునెడన్ 76

చేతులు లేవవు, బద్దల
చేతన్ బిగియించినట్లు చిత్రముగా, మో
చేతుల కీళులు వంగవు
ప్రీతి సుధం గ్రోలఁ గడఁగి వెతవడి రసురల్ 77

చట్టని మండె నద్దనుజజాతికి "వెండియు వెన్నుఁడింతలో
వెట్టులఁజేసి మమ్ము నొక వేడుకఁ జూచుచునుండె; చేతులన్
బిట్ట బిగించునే! యిటకుఁ బిల్వఁడు! తెల్పఁడు, వానిరక్తముల్
జుట్టద మేమిగాఁగఁ దలఁచున్ దితిసంతతి యున్న నింతకున్ 78

అనుచు మినుముట్టు క్రోధం
బున రక్కసులెల్ల రొక్క మొగి నఱచుడు, వెం
టనె వచ్చి విష్ణు విట్లనె
దనుజులతో శాంతవచన తత్పరబుద్ధిన్ 79

"మీకే కాదదె నిర్జర ప్రతతికిన్ మీలాగె మోచేతి క
ట్టాకల్పించితి, వారలో తినుటలేదా? రండుచూపింతు నం
బా కంజాక్షుఁడు కట్టియున్న తెఱఁదీయంబంచెఁ గన్పించె ది
వ్యాకారుల్ సురలా సుధం గొనెడి దృశ్యంబద్భుతాపాదియై

ముడువఁగ వంగని కరముల
ముడువం దలపెట్టి కొకరి మూతికి నొకర
య్యెడఁ బాత్రను లందిచ్చుచుఁ
గుడుచుచు నున్నారు దేవకోటు లమృతమున్ 81

దిగ్భ్రాంతి చెందె నేతా
దృగ్భ్రాంతి జడుపాయమునకు మృడుఁ, డటుదైత్యుల్
వాగ్భ్రష్టులైరి, హరి స
మ్యగ్భ్రాతృప్రీతి నప్పు డనె శంకరుతోన్ 82

చూచితె దేవదైత్య మనసుల్! దితి సంతతి స్వార్థమైన యా
లోచనఁ దాము తాము తిన లోఁ దలపోయఁ బరోపకారకా
ర్యాచరణమ్ముచే నమరు లవ్వలివారికిఁ బెట్టి రెన్నఁగా
నీచము స్వార్థ మున్నతము నిత్యపరోపకృతిక్రియాగతుల్ 83

ఇతరులకు సాయపడియెడి
మతి గలుగుట దేవగుణము, మహిస్వార్థమున
సక్త దైత్య గుణము, నరుఁ డు
న్నతుఁడగు, దేవుఁడగుఁ బరజనహితాచరణన్ 84

వ. అని యిట్లాచార్యుండు దేవతత్త్వ నిరూపకంబైన
యుపాఖ్యానంబు నుపన్యసించిన 85

-: ఒక నాస్తికుఁడు భగవదస్తిత్వమును ప్రశ్నించుట :-

ఆ కత విన్న సభ్యులు స్మితాననులై కథరక్తిఁ గట్టి నా
హా! కొనియాడఁ దగ్గిమలుపంచుఁ బ్రశంస యొనర్ప నొక్క చా
ర్వాకుని 'చుట్ట మిట్లడిగె బ్రహ్మవిదున్'' మఱి దేవుఁడన్నవాఁ
డేకడ నుండె? చూపఁగలరే? కని నమ్మెదవాని యస్తితన్" 86

అని నాస్తిక దృక్పథమునఁ
గని కానీ నమ్మఁజుమి భగవదస్తిత్వం
బని తేల్చిన మిత్రున కి
ట్లనియెఁ దిరిగి బ్రహ్మవేత్త యాదరబుద్ధిన్ 87

-: బ్రహ్మవేత్త చేసిన యాస్తిక వాదము :-

కంటికిఁ గానిపించిననె కాని మఱే నెది విశ్వసింప నం
చంటయు నర్థమే? మధువు నందలి తీపితనమ్ము, పూవునం
దంటిన సౌరభమ్ము, శ్రుతిహాయిగ మెచ్చెడి గానవిద్య, నీ
యొంటికి సోఁకు శీతలత యుష్ణతలుం గనరావు లేనివే? 88

కానిపించిన యంత మాత్రానఁ గలవె?
దూరవుంగొండ నునుపె? యీ ధారుణీ త
లమ్ము బల్లపఱుపె? యాకసమ్ములోని
రిక్క లింతింత చుక్కలే నిక్కమునకు?

నేలయు నింగితాఁకు సరణిం గనిపించును తాఁకుచున్నవా?
కాలము వస్తుతత్త్వమునఁ గానఁగరా దది లేకపోయెనా?
యేలవివాద మిట్టి యయి దిందియముల్ గ్రహియింపరాని త
త్త్వాల మనస్సు బుద్ధియను భవ్యతరేంద్రియముల్ గ్రహించెడున్

వ. ప్రత్యక్షం బొకండె ప్రమాణంబుకాదు. అనుమాన
శాస్త్రాప్తవాక్య ప్రమాణంబులును బ్రమాణంబులగు వినుము: 91

ఒక పొదనుండి ధూమమొగి నూర్ధ్వముఖంబయి వచ్చుచున్న న
గ్నికణము లేడనో పొదను నెక్కొని డాగివసించి యున్నవం
టకును, దవాగ్ని కొమ్మకొమ డగ్గరి రాసికొనంగఁ బుట్టునం
టకు ననుమాన శాస్త్రవచనంబులె కావె క్రమప్రమాణముల్? 92

ఈ రెండిట సందేహ ని
వారణ మటుకాదొ యాప్త వాక్యము వలనన్
దీరును, నీపిత యితఁడని
వారును వీరెఱుక పఱచు వాక్యము గొనమే: 93

అగ్గతి నాప్తోక్తికిఁ దల
యొగ్గక తలిదండ్రు లెవ్వరో తాఁ దానై
పగ్గె నెఱుంగఁ గడంగుట
యగ్గిం దైలమును బిండు యత్నము గాదే? 94

వ. ఇవె కాక నిదర్శనంబును ప్రమాణంబుగాఁ బరిగణింపం
దగు ఇది ప్రత్యక్షంబునకు సహాయకంబు 95

హేతువాద దృష్టి కే మాత్ర మందక
జరుగు చుండుఁ గొన్ని సంఘటనలు
మహి నిదర్శన ప్రమాణంబు లట్టివి
దేవు నునికి వానఁ దెలియ నగును 96

నా యెఱుక నొక్క శుద్ధా
మాయిక బాలుండు తప్పి మరలఁ బితరులన్
డాయ ఘటిల్లెను దేవుని
చేయూతకు సాక్ష్య మగు విచిత్రప్రాప్తిన్" 97

-: తప్పి పోయిన బాలుఁడు తల్లిదండ్రులను చేరుట :-

అనుడున్ జెంగటఁ గూరుచున్న పెదకాఁ "పబ్బాలుఁ డెవ్వారి నం
దనుఁ డేరీతిని తప్పిపోయెఁ? దుద కాతం డెట్లు లిల్ సేరె? మీ
యనుభూతిన్ ఘటియిల్లెనంద్రు గురువర్యా! దీని నాద్యంతమున్
వినిపింపుండు! కుతూహలం బగు" ననన్ విన్పించి రిట్లగ్గురుల్ 98

మంజుల భగవన్మందిర
పుంజము గల రాణ్మహేంద్రపురి వాక్పటుతా
రంజిత సత్సభుఁడై మృ
త్యుంజయుఁ డను నొక్క బ్రాహ్మణోత్తముఁ డుండున్ 99

చదివిన వాఁడు శిష్యజనసంఘములం జదివించువాఁడు నె
మ్మది గలవాఁడు వ్యాసముని మాన్యుఁడు నన్నయభట్టు లన్న మై
యొదిగి నమస్కరించు వినయోన్నతుఁ డీషదధీతి పాండితీ
వదనుల కడ్డుకట్ట, కవి, పల్వురకున్ గుఱి శబ్దసాధుతన్ 100

ఆతని యింతి కోరికెలు నాశలు లేని గృహస్థురాలు, గ
ర్వాతిశయేతర ప్రకృతి, యాప్తులు బంధువు లన్నఁ దద్దయుం
బ్రీతి గలట్టి తల్లి, స్మితరీతిసదామితవాగ్వినీత సా
ధ్వీతతి కొజ్జబంతి, పతిదేశికవాక్య శిరోవిభూషయున్ 101

దైవ మాద్విజుఁ బెక్కు చందాలఁ బ్రోవఁ
దృప్తివడు నార్తిపడు నొక్క తీరునందె-
రెండవ కుమారుఁ డొకఁ డవధ్యుండు పుట్టె,
ఆఁకటికిఁ గూడ నన్నము నడుగ లేఁడు 102

తినిపింపం దిను, త్రావఁ ద్రావుమన మాతృస్వామినీ నిత్య ర
క్షణమందుండిన నున్న యట్లు నడచున్ స్వగ్రామ మేదో వచిం
పనులేఁ డెవ్వరు తల్లిదండ్రులొ వచింపంజాలఁ డేదిక్కుగాఁ
గనుచూపుల్ ప్రసరించు నా దిశఁ జనున్ గర్మానుభూతిస్థితిన్ 103

మఱి ధరామరు పెద్ద కుమారుఁ డనఁగ
నతిసమర్థుఁడు వేత్త కుశాగ్రబుద్ధి,
యంత్రతంత్ర విధిజ్ఞుండు నచట నిచట
వృత్తి రీతిని తగ సంచరించు చుండు 104

అతఁడు బెజవాడఁ గనకదుర్గమ్మ వీటఁ
గాపురం బుండె నిపుడు భాగ్యనగరంబు
వెళ్ళ మని వచ్చెఁ బ్రభుతాజ్ఞ, వెళ్ళ నుండె
నేఁడొ మఱునాఁడొ; యద్ది తండ్రికిని దెలిపె 105

కొడు కీఁక దూరదేశమునకుం జననుం డెను, చూచివత్త మం
చెడఁదఁదలంచి యాద్విజుఁడు మృత్యుజయుండు సదారపుత్రుడై
వడిఁ జనెఁ బుత్రుఁడున్న బెజవాడకుఁ, జేరిన నాఁడె యయ్యవ
ధ్యుఁడు సుతుఁ డెట్లు తప్పెనొ యెటోయరిగెన్ నగరాంగణమ్ములన్

తల్లి నీరుగారెఁ దండ్రి తల్లడమందెఁ
దద్ద కలఁత చెందెఁ బెద్ద కొడుకు
కోడ లడలె ననుఁగు కూతురు శోకించె
నిరుగు పొరుగు చలితహృదయు లైరి 107

నగరవాహనములు నడయాడు వీథులఁ
గట్లు తెగిన మొత్తగజము లట్లు
కాలువలు స్రవించుఁ గాలభిల్లుం డల్లి
యిలను బఱచి నట్టి వలల యట్లు 108

నిద్రాహారము లుజ్జగించి సుతు నన్వేషింపఁగాఁ దండ్రి యా
వద్రీతుల్ శ్రమియించి కాళ్ళరిగిపోవన్ ద్రిమ్మరెన్, తల్లి భ
క్తిద్రాఘిష్ఠమనస్క మ్రొక్కని మఱే దేవుండులేఁ డెవ్వఁ డా
పద్రక్షామతి సాయమౌనా యని త్రోవల్ చూచుఁ బుత్రార్తయై 109

ఇడిగొ మీబిడ్డఁ డిక్కగనే కలండు
తెచ్చితి మటంచుఁ జూపియో! తెచ్చికొండఁ
టంచుఁ జూపించియో పున్నియమ్ము గట్టు
కొనెడు సుజనులు వచ్చెద రనుచు వేచు 110

కొడుకు జాడలేదు కడచెను పదినాళు
లెవరి పనులు వారి వెవరి కెవరు?
అన్న భాగ్యనగర మరిగెఁ దండ్రియు రాణ్మ
హేంద్రపురికిఁ దరలె నెట్టకేని 111

నుడువ నోరు లేని బుడుతను గృష్ణార్ప
ణ మ్మొనర్చి తరిలి నారె కాని,
ఆ కుటుంబసభ్యు లైనట్టి వారికి
మెదుకు దిగునః మనసు కుదుట వడునః 112

అది వర్షానిశి, యర్ధరాత్రి, చలిగాడ్పు చెంప యీచెంప, త
గ్గదలం జూపని జల్లు లుర్మ లిటు లాక్రోశించె నాతండ్రిలో
యెద యారేయి "కుమారుఁ డేడఁ డలఁడో! యేపంచవారైన సుం
త దయంజూపిరొ లేదొ నా సుతునిమీఁదన్! రోసిరో త్రోసిరో! 113

కొడు కీ జడివానకు నె
క్కడ ముద్దగఁదడిసి చలికి గజగజ మను చే
నడివీథిని బడియుండెనొ
యొడలి బురద గిరద తెలియ కొంటరి వాఁడై." 114

వ. ఇట్లు గృహి ప్రతికష్టపుగడియఁ గుమారు నిస్సహాయత్వంబునకుఁ గుమిలి కుమిలి దుఃఖించుచుఁ గాలంబు వెళ్ళఁ బుచ్చుచుండె. 115

కడచెను కొన్ని మాసము లొకం డొక భోజనవేళ వచ్చి "మీ
కొడుకును బోలియుండె నొక కుఱ్ఱఁడు, దక్షిణవీథి నన్న మ
మ్మొడు పెదమేడ యెట్టెదుట మేన్ గృశియించి వసించియుండె నే
గుడుః కొనితెచ్చుకొం డనుచుఁ గోరి వచించి చనెన్ క్షణమ్మునన్ 116

ప్రాణము లేచివచ్చినది యమ్మకు నయ్యకుఁ గాలిసట్టి దే
హానకు వెన్నరాసినటులైనది గ్రక్కున వాహనమ్ము చేఁ
బూని, మనస్సు కన్నుఁగవ పుత్రుని జీర్ణశరీరరూపరే
ఖానిభృతమ్ములై వెదకఁగాఁ బరుగెత్తెఁ దదుక్తవీథికిన్ 117

ఆ పుణ్యాత్ముఁడు చెప్పియున్నకడనే యాసీనుఁడై యున్నవాఁ
డాపుత్రుండు 'మదాత్మజుం డవున? కాదా?' యం చెదో శంక సం
దీపింపం బితచిత్తవీధిఁ గొడుకుండెన్ ధూళిమాలిన్యుఁడై
యాపచ్ఛల్యుఁడు శ్మశ్రుకశ్మలముఖుండై భిక్షుకాకారుఁడై 118

పట్టి నొకబండిఁ గూర్చుండఁ బెట్టి యిల్లు
చేర్చె జనకుండు, అక్కునఁ జేర్చె జనని
చిమ్ముకొని వచ్చు నశ్రుపూరమ్ము లోనఁ
దడిసె నాబిడ, బిడ్డఁడుఁ దడిసి పోయె 119

ఎక్కడి బెజవాడ! యెక్కడి రాణ్మహేం
ద్రపురి! యెట్లు చేరెఁ దత్సుతుండు?
లోకమే యెఱుంగఁ డా కృపాసింధుఁడే
కేలు పట్టి నడిపి గృహము చేర్చె 120

వ. ఇత్తెఱంగు బ్రహ్మవేత్త యెఱింగించిన వృత్తాంతంబు
విని చిత్తంబున నేమి తలంచెనో కాని యా నాస్తికుండు 121

"తనపేరును దనయూరును
దన తలిదండ్రులను దెలుపు తావన్మాత్రం
బును మెద డెఱుఁగని బాలుం
డనుగతి నిలు సేరె ననిస నాశ్చర్యంబో'' 122

అని వచియించి లేచిచనె నచ్చటి పెద్దలతోడ నొజ్జలి
ట్లనిరి "మతాలు రెండె, యవియాస్తిక నాస్తికముల్, పరాత్పరుం
డనియెడు వాఁ డొకండె మఱి యయ్యయిజాతులు వానినే విభి
న్ననియత నామరూపకలనన్ భజియించుఁ దదాస్తికాంశలై 123

ఒకనికి దైవము శివుఁడగు
నొకనికి నారాయణుండు నొకనికి నల్లా
యొకనికి యెహోవ, గ్రంథం
బొకనికి దైవమగుఁ దత్తదుచితేష్టగతిన్ 124

ఆస్తిక దృక్పథంబు గల యన్నిమతంబుల దైవపూజలున్
నిస్తులభక్తియున్ నియమనిష్ఠలు, దానమనస్కతల్ సదా
వాస్తవ భాషణంబు నుపవాసములుండుట లోనుగాఁగ ధ
ర్మస్థితు లెల్లనున్ సమము, మందులెఱుంగరు లోనితత్త్వమున్ 125

నా దేవుఁడె దేవుండని
నీ దేవుని దేవుఁడనుట నేరంబని వా
గ్వాదమునకు దిగుట మతో
న్మాదంబగుఁ దుదకు మారణక్రియ లెగయున్'' 126

ఈ రీతి నొజ్జ లాత్మో
దారదృఢోద్దేశ మచటి తన మిత్రులకుం
గోరి వచించుచు నుండఁగఁ
జేరంగా వచ్చె నొక్క చిఱుతఁ డుఱుకుచున్ 127

చేర వచ్చి "తాతగారు! మీ మేనల్లుఁ
డఁట వచ్చెనంట యవ్వగారు
చెప్పిరారః యనిరి చెప్పతి నేగెద"
ననుచు గెంతుకొనుచుఁ జనెఁ జిఱుతఁడు 128

ఇఁక బ్రహ్మవేత్త కథఁ గం
చికిఁ జేరిచి తాను నిల్లు చేరెను, శ్రోతల్
వికసితహృదయమ్ములు నిం
డ్లకు మరలిరి రాత్రి భోజనమ్ములు పడకల్. 129

---

శ్రీ గాడేపల్లి మల్లికార్జున సుబ్బాంబా కుమార కుక్కుటేశ్వర
ప్రణీతం బయిన ఆనందవల్లి లోని ప్రథమాశ్వాసము ముగిసినది

ఆ మఱునాఁడు సూర్యుఁ డపరాద్రిని గ్రుంకఁగనుండె నిండ్లకున్
గోమహిషమ్ములున్ మరలెఁ గుజ్జులు నాటలు కట్టిపెట్టి రా
గ్రామపురోహితుల్ మడులు గట్టిరి సంధ్యలు వార్చికోఁగఁ ద
ద్గ్రామశుభాలయాంగణ వితర్దికిఁ జేరిరి శ్రోతృవక్తలున్ 130

రెక్కలువిచ్చి పొట్టకయి రివ్వునఁ జెట్టున కొక్క పిట్టగా
నెక్కడ నెక్కడో తిరిగి యే వల పాలనొ దేని నోటికో
చిక్కక యెల్లరుం దిరిగి చేరిరె గూండ్లకఁ టంచుఁ జిందులన్
ద్రొక్కుచు సంభ్రమించు ననఁ దోఁచె విహంగకులమ్ము కొమ్మలన్

పావురమ్ములు గోపురవరవిటంక
వేదికలఁ గూడి మణితమ్ము లూఁది పలికె,
గూఁటి మొగసాలలను గొనగోళ్ళ వ్రాలి
శౌకతతి చేసె సింహావలోక విహృతి 132

-: బ్రహ్మవేత్త మేనల్లుని వృత్తాంతము :-

అప్పుడు పెద్దరెడ్డి యొకఁ డందుకొనెన్ ‘గురువర్య! నిన్న మీ
యప్పసుతుండు వచ్చెఁగద! యాయన నాలుగునాళు లుందురా
యప్పుడె వెళ్ళిపోవలయునా? కొనివచ్చిన వారుకూడ నా
ల్గొప్పిద మైన వాక్యముల నుల్లములం దనిపింప విందుమే'' 133

అనవుడు బ్రహ్మవేత్త యనె “నల్లుఁడు రెండుదినంబు లుండు, వా
నిని దమయూరఁ గ్రొత్తగ వినిర్మితి చేసిన దేవళంబులో
ననుదిన పూజలన్ నడప నర్చకుఁగా నియమించి, రింతలోఁ
దనదు వివాహపుఁగొడవ, తర్జనభర్జన లేమి చెప్పెదున్! 134

వ. అప్పలుకులు విని నవ్వుచుఁ బెద్దరెడ్డి యిట్లనియె 135

"ఇఁకఁ దర్జన భర్జనలే
టికి? పూజరితనము దొరకె టెంకాయలు పం
డ్లు కఱవె? భార్యను బోషిం
చికొనం జాలండె! పెండ్లి చేసినఁ జెల్లున్" 136

అనినన్ బ్రహ్మవిదుండు తెల్పె "నది గా దవ్వానితో నిప్డు వ
చ్చినపేచీ, తన కొక్కపిల్ల కడునచ్చెన్, వాని మాతాపితల్
అనుఁగుంజెల్లెలు నన్నయున్ వదినె లయ్యమ్మాయి కార్నల్పు కో
తి నయం బింకొకపిల్లఁ జూతమను చెంతేఁ గోరి బోధించినన్
వినఁడాయెన్ మనవాఁడు, పైఁగనను నా నేత్రాలతోఁ జూడుఁ డా
డిన నీపిల్లనె పెండ్లియాడుమని నాడెందంబు బోధించు నా
కును నీ పిల్లకుఁ బూర్వజన్మగతమౌ గూఢప్రగాఢాను బం
ధన మేమున్నదొ మాఱుచెప్పకుఁ "డనున్ దా నిశ్చితస్వాంతుఁడై

-: పూర్వ జన్మానుబంధము - సింహము కుక్కపిల్ల కథ :-

నావిని రెడ్డిగా రడిగినారు "మహాశయ! పూర్వజన్మ బం
ధావృతకర్మ తత్త్వము యథార్థమె? చచ్చినవాఁడు పుట్టునే
యా వివరంబులం దెలుపుఁ" డన్న వచించె గురుండు "పూర్వ జ
న్మావృతబంధషుల్ నిజము; యర్థి వినుం డొకగాథ ముందుగన్ 138

దీనిని టాల్సుటాయి కవి తెల్పెను సింహము కుక్కపిల్లయన్
వాని విచిత్రమైత్రికథ, భారతసంస్కృతి నద్ది పూర్వజ
న్మానుభవంపుబంధ మని యందురు తత్కథఁ దెన్గుజాతి వా
క్యానుసృతిన్ వచింతు వినుఁ డంచు గురుం డిటుచెప్పె నాకతన్ 139

ఒక కుగ్రామము బోయ తత్పరిసర ప్రోగ్రాటవీ సింహభ
ల్లుక శార్దూల కపిద్విపాదుల కెరల్ సూపించి బంధించి మ
చ్చికకుందెచ్చి వినోదలీలలఁ బ్రదర్శింపించు నయ్యే పురీ
ప్రకరంబుల్ దిరుగాడుఁ బొట్టకొఱ కర్థంబున్ సమార్జించుచున్ 140

తిరుగుచుఁ దిరుగుచు నతఁడొక
పరి గుడివాడ యను నగరి భద్రత డేరా
విరచించి జంతువులచే
నరిది వినోదములు నెఱపు నట్లొనరించెన్ 141

ఉరక మృగములఁ దిలకింప నరుగు దెంచు
వారు తలకొక్క రెండురూప్యములు గాని,
క్రూరమృగముల తిండికై కోడిఁ గాని
కుక్క నేఁ గానియర్పించు కొనఁగ వలయు 142

ఒకనాఁ డొకచూపరి వే
డుకఁ జూడన్ వచ్చి యెక్కడో దొరకిన కొం
డొక కుక్కపిల్ల నా బో
యకు నిచ్చె నతండు చూడ ననుమతి యిచ్చెన్ 143

అమరఁగఁ గుర్కురమ్ము నదె వ్యాధుఁడు చేకొని యొక్క దొడ్డసిం
హము నిడియున్న బోను దరియంజని, తన్మృగరాజదృక్సమ
క్షమున నొకింత తచ్ఛునకశాబముఁ జూపి పయింగలట్టి రం
ధ్రము తలు పల్లనం దెఱచి గ్రక్కునఁ గుక్కను వైచె లోనికిన్

ఎక్కడ పైఁబడి కుతిక క
సుక్కునఁ గొఱకునొ యటంచు శునకము గుండెల్
గ్రక్కదల నొదుఁగు చొదుగుచు
నక్కేసరిఁ జూడ నోడి యవనతముఖమై 145

కుయికుయి లాడు, వెన్క కరుగున్, జరగున్ మెడవంచుఁ గోరపల్
బయట వడంగ నోర్దెఱచు, వాలముఁ బృష్ఠముక్రిందఁ దూర్పు సం
శయపడు, బోనుచువ్వలకు జారవడున్, దిగజారుఁ గూరుచుం
డు యముని గన్న జీవుని యటుల్ బెగడొందు నమందవేదనన్

అప్పటికిఁ బ్రాణములు దక్కి నట్టి కుక్క
యోరచూపుల హర్యక్షవీరు ముఖము
లోనికిం గంచు, గౌరవలోలవాల
శిఖమునై యుండె, బోయఁ డచ్చెరువు నొందె 147

పిమ్మట సింహం బా శున
కమ్మును బట్టించుకొనని గతి నొరిగెను నీ
త్రమ్ములు మూయుచు నెడనెడ
నెమ్మది నరవిచ్చి యా శునిం గనుగొంచున్ 148

మేకనొ గొఱ్ఱెనో తునిమి మేఁతగ నైచిన నా మృగేంద్రమ
ట్టాఁకటఁ జీల్చిచీల్చి తిను నప్పలలాంశము నోటఁబట్టుచుం
దోకొని పోయి యాదరముతో శునిముందరఁ బెట్టుఁ గుక్కయుం
గైకొని యారగించు నెఱుఁగం దరమే జననానుబంధముల్ 149

పండుకొన్న సింహపతి తోఁక నా కుక్క
పంటఁ గఱచి లాగుఁ బైకిఁ బ్రాకు,
ముందుఁగాల సింగముమొగమ్ముఁ దాడించు
నొద్ద నొరిగి తద్ద గద్దురించు 150

ఇట్లు కొన్ని దినము లేగె నొకం డొక్క
నాఁడు జంతువులను జూడ వచ్చి
యా మృగేంద్రుడు బోను నందున్న యా కుక్క
తనది గా నెఱింగి తత్క్షణంబ 151

ఆయజమానుఁ గన్గొని మహాశయుఁ బోనున నున్న కుక్క నా
దే, యెటువోయెనో యనుచు నిన్నిదినాల్ దిగులొంది యుంటి మీ
కేయెడఁ జిక్కె? వేగఁ గరుణించి శునిన్ వెలిదీసి నాది నా
కీయరె? కాదుగూడ దనిరేఁ బదిరూప్యము లిత్తు దీనికై 152

అనుచుఁ వెస బోను డగ్గరి యమ్మనుజుఁడు
"ప్రీతి ప్రీతి!" యటంచుఁ బేర్వెట్టి పిలిచె,
కుక్క స్వామిని గుర్తించి కుయికుయి మని
తోఁక నాడించుకొనుచు ముందునకు వచ్చె 153

అప్పుడు వ్యాధుఁడిట్లనియె"నయ్య! యెవండొ యొకండు మున్న నా
కిప్పసరంబు నిచ్చి చనియెన్ మృగరాజున కోగిరంబుగా
నప్పన చేసినాఁడ, తినదాయె మృగేంద్రము, రెండు నొక్కఁడై
గొప్పగఁగూడియాడుఁ గనుఁగొంటిరిగా"యని చూపిచెప్పుచున్ 154

"కుక్కను దీసియిత్తుఁ గయికొం" డని క్రిందలు పల్లనల్లనన్
బ్రక్కకు నొత్తిగించి నిడు పంగలకట్టను జొన్ప సింగ మ
మ్మక్క! మహోగ్రగర్జన భయంకరమై యెదిరించి వ్యాధు నా
చక్కిఁకిఁ జేరనీక పెలుచన్ గుఱువెట్టుచు నిల్చె నుద్ధతిన్ 155

ఎంత ప్రయత్నించినఁ గరి
హంత మఱెవ్వరిని కుక్క నవలికిఁ దీయన్
జెంతకు రానీయక దు
ర్దాంత క్రోధమున నడ్డు తగులుచు నుండెన్ 156

ఏమి చేయంగ లేక శ్వస్వామి చనియెఁ
జనుచుఁ దన చిరునామ వ్యాధునకుఁ దెలిపి
కుక్క నెపుడేనిఁ దీయఁ గల్గుదుర యేనిఁ
బంపుఁ డని కోరె; వ్యాధుండు వల్లె యనియె 157

అతఁ డట్లేగిన పూటఁగోలె శునకం బా స్వామి యాకొంప, యా
సతి, యాడించుచు వెంటఁద్రిప్పుకొను వత్సల్, దాసదాసీ జనుల్
గతుకం బెట్టిన మట్టిమూఁకు డొకటే కన్మందు తారాడి వి
స్మృతికిన్ రామికి బెంగవెట్టుకొని చచ్చెన్ మీఁది మూన్నాళ్ళకున్

చచ్చిన కుక్కను బోయం
డుచ్చున నీవలకుఁ దీయ నుద్యోగించున్
హెచ్చిన రుష సింహము ని
ప్పచ్చర మొనరించు నతని బహుయత్నంబుల్ 159

అప్పుడు బోయఁడిట్లొక యుపాయముపన్నె "మృగేంద్ర మాడుకో
నప్పనచేసి యొండు శునకార్భకమున్ మృతకుర్కురార్భమున్
దప్పఁ దొలంగఁద్రోసెద నిదానముగా" నని యొండు కుక్కఁ దా
నప్పుడ పట్టితెచ్చి విడనాడె మృగాధిపుఁ డున్న బోనులో 160

ఒక్క దూఁకున సింహ మా కుక్క మీఁది
కుఱికి, కోరలఁ గుత్తుకం గొఱికి పట్టి
యెత్తి యిట్టటు ఝాడించి యిలకుఁ గొట్టి
చీల్చి చెండాడి పీలికల్ చేసివైచె 161

చేసి యిట్టటు నాలుకచే సెలవులు
నాకికొంచు మృగేంద్ర మరతట శయించె
నొక్క ప్రక్కన, బోయకు దిక్కు తోఁచ
లేదు కంఠీరవ విచిత్రలీలఁ జూచి 162

అది మొదలు నెఱచి ముట్టక
యుదకంబుల నేనిఁ ద్రావ నొల్లక యేదో
యెద దిగులు తగులు చింతయు
నొదవ నిజాంఘ్రులను శీర్షముంచి పరుండున్ 163

కడచెన్ గొన్నిదినాలు కేసరి బుభుక్షాతృష్ణలం గెల్చి పో
ల్చెడు మౌనీంద్రుని లీల బాహికజగల్లీలాతిరోధాన మా
నెడఁదన్ గ్రుంగి కృశించి తన్మృతసఖున్ వీక్షించుచున్ బ్రాణము
ల్విడిచెన్ గొండొక వేగుజాముగడియన్, వింతల్ జనుర్బంధముల్.

వ. అని యిట్టుల య్యాచార్యుండు సింహశునక సహవాస విచిత్రసంఘటన విన్పించి మఱియు నిట్లనె. 165

జీర్ణవస్త్రంబు నరుఁడు త్యజించి వేఱు
వస్త్రము గ్రహించి ధరియించు భంగి నాత్మ
జీర్ణదేహంబు విడి ప్రవేశించు మఱొక
దేహ మన్నది శ్రీకృష్ణదివ్యబోధ 166

ఈ సత్యంబును వ్రాసినట్టి ఋషి యోగీంద్రుండు నిస్స్వార్థచిం
తాసచ్ఛీలుఁడు వేదవేత్తయుఁ బురాణగ్రంథనిర్మాత యౌ
వ్యాసుం, డమ్మునిపల్కె నమ్మని మనుష్యప్రాణి యెవ్వాని వి
శ్వాసాత్ముండయి నమ్మునింకఁ జెడు నల్పజ్ఞానిఁ బాటించినన్. 167

ఆత్మ, ప్రాక్కర్మవాసన లంటి రాఁగ
మోసి తిరుగుచుఁ దగు గర్భవాసగుప్తిఁ
దవులువడి శేషకర్మానుభవము కొఱకు
జగతిఁ బ్రభవించు నదె పునర్జన్మ మనఁగ. 168

వ. పునర్జన్మంబు యథార్థం బని మున్ను శివుండు పార్వతికిం దెల్పె. కోటి కొక్క నరుండు నివృత్తిమార్గంబు నభ్యసించి ముక్తుండు కానోపు. సాధారణప్రాణులు ప్రవృత్తిమార్గసంచారుల. ప్రవృత్తిమార్గం బన సకామజీవనంబు. సకాముండైన జీవుండు త్యక్తశరీరుం డయి మరల ధరణి నవతరించు నఁట. అత్తెఱంగు వినుండు. 169

అమ్మెయిఁ దా బ్రవృత్తిపథ మందు గతించిన జీవుఁ డంధరా
త్రమ్ములఁ గృష్ణపక్షముల, దక్షిణరవ్యయనంబు లందు, దీ
ర్ఘమ్మగు యాత్ర స్వర్గనరకమ్ములఁ జేరి వసించి, చంద్రలో
కమ్మున వచ్చి వ్రాలుఁ దిరుగన్ బ్రభవింప ధరాతలంబుపై 170

చంద్రలోకమ్ము నుండి జ్యోత్స్నలను గరఁగి
మేఘముల డిగ్గు, మేఘభూమితలి నుండి
వర్షమునఁ జేరు వసుధ, నవ్వసుధ నుండి
సస్యముల దూరు నట్టి సస్యముల నుండి 171

పురుషజంతువులకుఁ బ్రాఁకుఁ బురుషజంతు
దేహముల నుండి స్త్రీజంతుదేహములను
జొచ్చుఁ జొచ్చి గర్భస్థుఁడై యోనినిఁ బడు
శేషకర్మానుభవము భుజించు కొఱకు. 172

మునుపు దీనిని ధర్మరాజునకుఁ దెలిపె
నారదుం డని మాటల నడుమ నెట్లొ
వచ్చి మా యప్పకొడుకు వాక్రుచ్చె, వాఁడొ
స్మార్తమంత్రాదికము నేర్చె శ్రద్ధవెట్టి. 173

ఏవో నాలుగు మంత్రము
లా విధముగ నోటనలఁగె నాతని కదియే
జీవన మైనది; నేఁ డా
దేవళమున నర్చకతయు దీని చలువయే." 174

-: మంత్రము లున్నవా ? అవి పనిచేయునా ? :-

అని యాచార్యుఁడు నుడివిన
విని యొక గ్రామస్థుఁ డడిగె వెండియు "మంత్రా
లనునవి కలవే ? యయ్యవి
పని చేయుట కలదె ?" అనిన బ్రహ్మవిదుఁ డనున్. 175

"చాల సమంజసం బయిన సంశయ మియ్యది, లోకు లందు మం
త్రాలకుఁ జింతకాయ లవిరాలునె" యం చిలఁ జింతకాయలన్
రాలిచికోఁగ మంత్రపఠనశ్రమ మేటికి ? చెట్టునెక్కినం
జాలును కట్టెయో శిలయొ చాలును కాయలు రాల్చుకొంటకన్ 176

భౌతికదృశ్యవస్తుసముపార్జన కుండపు మంత్రముల్, పర
ఖ్యాతికదైవతత్త్వసుముఖత్వనిమిత్తము, పైత్రదైవత
ప్రేతగతాత్మలం బిలిచి పిండముపెట్టఁగ నూర్ధ్వలోకముల్
ప్రీతిని జేర్పఁగా నుపకరించును మంత్రము లార్షదృష్టముల్. 177

ఎట్టి మంత్రమేని యేడు దినంబులు
జప మొనర్ప గగన చరులఁ గాంచు
శక్తి గలుగు నంచు సంయమి శ్రీనార
దుండు చెప్పెఁ దొల్లి ధ్రువుని తోడ. 178

వ. ఎవ్వటి పురాణంబొ యేల ? మొనమొన్నటి వారు గణపతిముని. వారి కరుణాచలక్షేత్రంబున మంత్రసిద్ధి యై పార్వతీ దేవి యనుగ్రహంబు లభించె. ఆ చరిత్రంబు సవిస్తరంబుగ విన్పింతు వినుండని బ్రహ్మవేత్త గ్రామీణమిత్రుల కిట్లు చెప్పం దొడంగె. 179

-: కావ్యకంఠగణపతిమునికి మంత్రసిద్ధియగుట :-

కలువఱాయి యనెడు గ్రామంబు నం దొక్క
ద్రవిడ విప్రు నింటఁ బ్రభవ మంది
కావ్యకంఠబిరుదగణపతి, వైరాగ్య
దృష్టి నెఱపు బాల్యవృత్తి నుండి. 180

యౌవనంబు నందు నాలి యందలి మోహ
మవలఁ బెట్టి తీర్థయాత్ర లరిగి
యొక్క పుణ్యగురుని యుపదేశమున "శివా
యనమ" యన్న మంత్రమును గడించె. 181

గణపతి రేఁబవళ్లు క్షణకాలము తీరికయైన వ్యర్థయా
పన మొనరింప క ప్పరమపావనమంత్రజపక్రియైక భా
జనహృదయుండు నై కడపుఁ జాల దినమ్ములు మాసముల్ సమల్
చనియె నతం డొ యాత్రలవశంబునఁ ద్రిమ్మరు నిక్కడక్కడన్.

ఆయన తమ్ముఁ గుఱ్ఱ యొకఁ డన్న నుబాయక తోఁకవెంట నా
రాయణ యట్లు వచ్చె శివరాముఁడు, రాయిడి కోర్వలేని లేఁ
బ్రాయపువాఁడు, సాయమనువంకను బల్ పొగబండి యానము
ల్సేయుచు సంతసించు మృదుచిత్తుఁడు, భ్రాతకుఁ బ్రీతిపాత్రుఁడున్

అన్న దమ్ము లిర్వు రా యా మహాతీర్థ
జలవిగాహనములు, సకలదైవ
దర్శనములు చేసి, తమిఁ జేరి రదె కాంచి
కాపురంబు సురుల కాఁపురంబు 184

ఆ కాంచీనగరంబు ద్రావిడవిశిష్టాచారరక్షాశిలా
ప్రాకారంబు, ఏకామ్రధామరజతాద్రివాస పుణ్యైకకా
లాకల్పవృక్షము, మృద్ధికల్పకుజ, మవ్యాజప్రజోపేత, మ
స్తోకశ్రీద, ముదారసత్రగృహసందోహప్రతిష్ఠాకమున్ 185

ఏకామ్రనాథ కామా
క్షికళ్యాణులకు నమ్రచిత్తమ్ములఁ బూ
జాకార్య మన్నదమ్ములు
గైకొని కావించి యూరు గన నరిగి రటుల్. 186

ఒక జోస్యుం డట మిత్రుఁడై గణపతిప్రోద్దంటపాండిత్యలీ
లకు ముగ్ధుండయి, యాత్మసద్మమున నిర్వంగఁ జోటు కల్పించి భ
క్తికి సౌకర్యమొనర్చి పెట్టఁ దగురీతిన్, దృప్తుఁడై మోక్షకా
రకపంచాక్షరి నాల్గులో జప మొనర్పన్ సాగె నా ప్రాజ్ఞుఁడున్ 187

ఆ సమీపమందె యాంజనేయస్వామి
వారి యాలయమ్ము వఱలు నొకటి,
జీర్ణదశన యుంట సేవింప రా రెవ్వ
రప్పుడుత్కుమారు నాశ్రయించి 188

ఒనవర్జిత మగు నగుడి
గణపతి యేకాంతజప సుఖస్థితి కెంతే
ననుకూల మ్మాట నటకుం
జని యిప్పుడపు డనక నెఱప సాగె జపంబున్ 189

చనె నిటు కొన్నివారములు శ్రద్ధగ మంత్రజపంబు సేయుచున్
గణపతి వుచ్చె, వచ్చిన దొకానొక యుత్తర మందుఁ దండ్రి జ
బ్బునఁ బడెనంచుఁ దక్షణమె పుత్రులు రావలెనంచు నుండె నా
నని యనదమ్ము లిద్దఱు ప్రయాణము కట్టిరి కల్వరాయికిన్ 190

అపు డా జ్యౌతిషికాప్తమిత్రుఁడనె "నాయ్యా! యింతదూరమ్ము మీ
రెపు డీపై నడుపంబట్టు నిట్లె యరుణాద్రీశున్ సమర్చించి పొం
డు ఫలించు న్మీయాత్ర" యన్న విని సంతోషించి వా రధ్వగ
పరిశ్రయా నయ్యరుణాచలంబునకుఁ బోవన్ సిద్ధులై రర్థిమై 191

ఆ యన్నదమ్ము లాదిన
సాయం సమయమున కరుణశైల మరిగి దే
వాయతనమునకు నడచిరి
ప్రాయతభక్తి ప్రపత్తు లాతుర వెట్టన్ 192

ప్రొద్దువోయినఁ దలుపులు మూయఁవచ్చు
ననుచు గణపతి యడుగొక్క యంగ గాఁగ
నడచి, యొక సందు వాకిట గుడినిఁ జొచ్చెఁ
జొచ్చెనో లేదొ దర్శనం బిచ్చె గౌరి 193

ఆ చిఱునవ్వు లా వికసితానన మా మృదులేక్షణంబు లా
కాచిన పండువెన్నెల నిగారము లీనెడు ఫాలభాగ మా
రోచిరుదాత్తతత్పద సరోజము లా తనుధాళధళ్య చాం
ద్రీ చతురత్వముల్ గణపతిం దలమున్కలు చేసివైచినన్ 194

జలదరించి, తల్లి సర్వాంగ కరుణామ
యత్వమునకుఁ బరవశత్వ మంది
చూచుచుండ, దేవి జూటాగ్రసుమములు
కదలి రాలెఁ జాటి కనికరమ్ము 195

ఆ మీఁదట గణపతి శివ
రాములు నరుణాచలేశ్వర ప్రభుఁ గరుణా
ధాము * "అపీతకుచాంబా"
రామాధవుఁ గొలిచి చనిరి గ్రామము చూడన్ 196

గణపతి నవరాత్రోత్సవ
దినముల నది కడమ దినము, దివ్యముగా న
య్యెనిమిది రాత్రులు చన్నవి
జనహృదయవినోద వివిధ సముచితసభలన్ 197

* అరుణాచలము నందలి అమ్మవారి పేరు అపీతకుచాంబ

నాఁ డేకాదశి, పొద్దువోయె, జన మిండ్లంజేరుచుండెన్ హరి
క్రీడాగాథల నాలకించి, యదె భ్రాతృద్వంద్వ మా రాత్రి కే
గూఁడో నీడయొ చూచుకోఁదలఁచి తిర్గున్వీథియున్వీథి యా
పై డొక్కేడిచి తమ్ముగుఱ్ఱ విసిగింపం జొచ్చె నయ్యగ్రజున్ 198

తినఁ గొనిపెట్టు మంచు నిలఁదీసిన "కాని"యొసంగె నన్న;య
య్యనుజుఁ డరఁటిపండ్లు గొని యన్ని తినెన్ మఱి నంతనాఁగ కిం
కను గొనిపెట్టు మంచలుగఁగా గణపన్న నిరాకరించి యి
ట్లనె "మితిమీఱితిన్న నుదరార్తి యగున్ జెడునున్న స్వాస్థ్యమున్

నడు మే బ్రాహ్మణుకొంపనో యడిగి యన్నంబింత పెట్టింతుఁ దీ
రెడు నీయాఁకలి" యంచు నన్న యనుజుం ద్రిప్పన్ నిశావీథు, లె
య్యెడ యాచించిన లేదులేదనెడి పల్కే, చిత్రమయ్యెం గడుం
గడు నప్పాంథుల కట్టిగ్రామ మటదన్కన్ జూడ రామిన్ధరన్ 200

ఏ యేకాదశియైన, సత్రములఁ బోనీ వార్పులేకున్న న
న్యాయం బిడ్డను పిల్లపాపలకు నైనన్ వండివడ్డింపరా
యీ యూరంగల గేస్తు రాంద్రనుచుఁ దర్కింపంగఁ దాదృగ్దశా
ప్రాయం బైన పురాణ మగ్గణపతిస్వాంతంబునం దట్టినన్ 201

"మాభూత్ త్రైపూరుషీ విద్యా
మాభూత్ త్రైపూరుషం ధనమ్
మాభూత్ త్రైపూరుషీ ముక్తిః
కాశ్యాం నివసతాం సదా" 202

అని పయికింబఠించుకొను చల్లనఁ దమ్మునితోడ నేగు న
య్యనఘుని చేరఁబిల్చి వసుధామరవృద్ధగృహస్థుఁడొక్కఁ డి
ట్లనె "తమరేరొ పండితమహాశయు లిద్ది పఠించుకొంచుఁ బో
వను గతమేమి?" నాఁగ నగి పాంథుఁడు పల్కె గృహస్థుతో నిటుల్.

“మే మాంధ్రబ్రాహ్మణులము
స్వామిని దర్శించఁ గోరఁగ వచ్చితి మిటు, వీఁ
డా మా తమ్ముఁడు క్షుత్తున
కే మాత్రము తాళలేక యేడువఁ దొడఁగెన్. 203

పెట్టింత మన్న నొకయెడఁ
బట్టెం దన్నమ్ము మిగుల వండికొనుటయే
కట్టా! కనిపింపని యీ
పట్టణమున నెట్లు దీర్తు వాని క్షుధార్తిన్? 205

దానిని విని వృద్ధుఁడు స్మితంబొనరించి పలికె “మాదుభా
గ్యాన లభించినారు తమరయ్యలు! నేఁ డుపవాసముండి నా
చాన నిసిన్ ద్విజద్వయికి శ్రద్ధ నపోసన మీఁదలంచి యే
రే నరుదెంతురాయని నిరీక్షణ చేయుచునుండె పండయై. 206

మీఁదును మిక్కిలి రేఁ డే
కాదశితిథి యగుట భోక్తగా రా నొక్కం
డీ దరిదాపులఁ గనఁబడ
డాదిత్యసుధాంశు లట్టు లగపడిరి యిటన్. 207

ఇదె మా గేహము రండు లోపలికి మా వృద్ధావ్రతంబున్ జయ
ప్రదముం జేసి యనుగ్రహింపఁదగు విప్రద్వంద్వమా!” యనుచు న
మ్మది యర్థించె, సహోదరద్వయము సమ్మోదంబునం జేరె నా
సదనాంతస్స్థలి కల్పలాశశుచివిశ్వాసాంతరంగంబునన్ 208

నడవలఁ బంపల దీపము
లిడి యుంచిరి, గోమయమున నిల్లలికిరి ము
గ్గిడి రట్టులే వెలుపలి పె
రడునన్ దులసమ్మ చుట్టు ప్రమిద లిడి రాగన్ 209

ఇంటిలో నుండి వృద్ధగేహిని యొకర్తె
యెదురుగా వచ్చి మడిబట్ట లిచ్చిచనియె.
కడిగికొని కాళ్లు దోవతుల్ తడిపిపెైచి
మడుగులం దాల్చె నపుడు తమ్ముఁడును దాను. 210

గణపతికిఁగూడ నియమ మేకాదశితిథి
ననశనం, బైన నా రాత్రి తినఁదలంచెఁ
బెద్ద ముత్తైదువ వ్రతంబు వృథ యొనర్ప
మనసు రాకుంట దైవకల్పనము వెంట 211

అమ్మదియవ్వ వండినపదార్థము లద్భుతముల్, సుధాన్నమి
త్రమ్ములు, దొడ్డవడ్డన లుదారము, లాదరణల్ స్వమాతృసి
ద్ధమ్ములు, సాత్త్వికత్వములు దైవతముల్, మొగమోట లేక యా
తమ్ముఁడు నన్నయుం దినిరి తత్తదుదాత్తసమస్తభోజ్యముల్. 212

పారణ పూర్తియై తెనుఁగుబావలు పంచయరంగు మీఁదికిం
జేరిరి, గేహి దక్షిణలు చేర్చిన తమ్ములముల్ సహోదరో
దారుల చేతికిచ్చి "యిదె ధన్యులమైతిమి మేనువాల్పుఁడం
చోఁగ్రగ మూసి ద్వారము గృహోదరభాగము చేరె నవ్వుచున్. 213

ఇద్దఱకు గడియ లోపల
నిద్దుర పట్టినది, సగమునిసికడ వెస న
య్యిద్దఱకు వచ్చె మెలఁకువ
నిద్దురపెద్దమ్మ వదలి నెటి నరుగుటచే 214

లేచి యిట్టట్టు చూచి రంతయును న
గమ్యగోచరముగఁ గానఁ బడియె—హా
రేయి వాసు తిన్న గృహమేని గృహేశుఁ
లేని యున్నచోటుఁ గానరాదు. 215

తులసికోట లేదు. అలికిన నడవలు
గడులు లేవు, పదుల మడులు లేవు
వీధి జాతి యరఁగు మీఁద మేనులు వాల్చి
పవ్వళించి యున్నవారు వారు. 216

జరిగిన దెల్ల నిద్దకు స్పష్టముగా గుఱుతుండె, వృద్ధభూ
సురుఁడు క్షవీరచుటల్, వ్రతముచొప్పున నమ్మదియవ్వ వండి య
య్యిరువుర కట్ల పోసనము లిచ్చుట, కాకరకాయకూరయున్
బెరుఁగును బాయసమ్ములును పెట్టననంజుళు లొక్కరూపునన్. 217

తెల్లవారె మెల్లమెల్లన, గతరాత్రి
యింటి గేస్తు వచ్చి యిచ్చి చన్న
దక్షిణలును, బండ్లు, తమ్మలపాకులు
పెట్టియుండె నచటఁ బెట్టినట్లె. 218

ఆ యెదుటఁ జిన్న గణపతి
కోయిల గల దొకటి, యపుడె గుడి తెఱచుటకై
యాయత్తంపడి పూజరి
కాయలు పూల్ కప్పురంబు గంధము తెచ్చెన్. 219

తా మాతిథ్యము గొన్న యాగృహము తత్ప్రాంతఁబునం దేడనో
యే మార్మ్యలనొ యుండవచ్చునని యెంతే పట్టియుఁబట్టి వా
రా మాధ్యాహ్నముదాఁక బల్ వెదకి లేదన్ నిశ్చయఁబొట గా
రీమాత్రాద్భుతికిన్ నిదర్శమునాఁ దృష్టాత్ములై రియ్యడన్. 220

గణపతి శివరామునితో
ననియెను "పంచాక్షరీమహామంత్రజపం
బనుజుఁడ ! ఫలియించెనురా
నినమొన్నఁటఁ బంచకోటి నిండిన దేమో !" 221

వ. అట్లు కావ్యకంఠగణపతిముని యరుణాచలక్షేత్రంబున మంత్రసిద్ధి వడసె. ఈ వృత్తాంతంబు "నాయన"యను గ్రంథంబులోనిది, మిత్రులారా! ఇట నొక విశేషంబును గలదు. 222

ఆతఁడు 'గణపతి', గౌరీ
మాతకు సాక్షాత్సుతుండె; మఱి కావుననే
ఆ తల్లియె సుతు నాఁకలి
బ్రాతిగఁ గనిపెట్టి వండి వడ్డించికొనెన్ 223

వినుఁ డే పండొ ఫలమ్మొ దేవునకు నైవేద్యంబుగాఁ జూపి గి
ల్లిన లేశాంశము నోట వైచికొన నోలిం బాపముల్ వ్రీల, భూ
తలి విశ్వేశి స్వయమ్ముగా దిగి స్వహస్తస్వచ్ఛపాకంబు వె
ట్టిన సంతృప్తిగఁ దిన్న మర్త్యునకు రూఢిన్ జన్మరాహిత్యమే. 224

వ. మంత్రంబు పట్టి యిచ్చుటకుఁ బట్టుదలయ పట్టు. పట్టుదల యెట్టి కార్యంబును సాధించిపెట్టు. శాస్త్రజ్ఞులు అవిశ్రాంత పరిశోధనాభినివేశంబు వలన జగదుపకర్తలైరి. లక్ష్యశుద్ధి గల విద్యార్థి యంచితోద్యోగంబు వడయు చూచితిమి గదా మన మెఱింగిన నటవతంసుండు తారకరామారావు పట్టుదల మూలంబున నానాడు తెలుఁగుగద్దియ దక్కించుకొనియె" అనిన విని యొక్క విప్రవృద్ధుండు బ్రహ్మవేత్తతో నిట్లనియె. 225

మీ మాట నిజము, తారక
రామారావునకు మునుపు రాట్తంత్రములం
దేమాత్రము లే దనుభవ
మే మాడ్కిన్ దక్కఁగొనియె నింతకు గద్దెన్. 326

వ. సవిస్తరశః వినిపింపం దగు ననిన నయ్యాచార్యుం డచ్చటి సభాసదుల కేతచ్చరితం బిట్లు చెప్పఁదొడంగె. 227

మోజువడి యిందిరమ్మ ఫిరోజుగాంధి
కరము వట్టుట నిందిరాగాంధి యయ్యె.
తండ్రి త్రోవన నడచుచుఁ తత్పురంధ్రి
పట్టమని లేని యువరాజ్ఞి వలె వెలింగె. 234

ఆ నెహూ౹పండితుఁ డెం
తో నేర్పరి, స్వేచ్ఛ వచ్చియున్నది మొదలుం
గా నిజమృతిపర్యంతము
తానె ప్రధాని యయి భారతక్షితి నేలెన్ 235

అతని తరువాత నొకరిద్ద ఱా ప్రధాన
సచివపీఠమ్ము పై నెక్కి స్వల్పకాల
మేలి దిగిపోఁగ నిందిర యేఁగుదెంచి
మించి తనతండ్రి గద్దె సాధించుకొనియె, 236

సాధించుకొని పేదసాదల కిండ్లిచ్చి
ఁ ఒడ్లిచ్చి వారి లోఁబఱచు కొనియె,
దున్నుకో నలఁతిరైతుల కింత పొలమిచ్చి
హాలమిచ్చి వారి మెప్పులనుఁ బడసె,
కడుపు చేవని బీద లడిగిన ధనమిచ్చి
ఋణమిచ్చి తనవంకఁ ద్రిప్పుకొనియె,
ధనికుల నతిమైత్రిఁ గని యెట్లొ యంత్రించి
మంత్రించి హితులుగా మలచుకొనియె

యావదబ్ధిత్రయహిమాచలావృతక్షి
తిప్రదేశము నిజశాసనప్రతాప
మునకుఁ దలయొగ్గఁ దిరు గెఱుంగని విధాన
నేలె నిందిర జనబృంద మెలమి నొంద. 237

అయ్యైవారలు చూపెడు
నెయ్యంబు దలంచి ధారుణిం దన కెదురిం
కెయ్యెడ లేదను దీమసు
మయ్యంది రవొందియుండె నది యట్లుండన్ 238

తారకరామారా వను
ధీరుం డితఁ డవతరించె దివ్యాంశుల తత్
శ్రీరామ శ్రీకృష్ణా
ద్యారాధ్యుల పాత్ర దాల్చి యాంధ్రధరిత్రిన్. 239

నటుఁడై పుట్టి యసంఖ్యచిత్రములలోనన్ నాయకుండై మహా
ఘటికుండై యఖిలత్రిలింగజనహృత్కల్హారపాళీపరి
స్ఫుటపూర్ణామృతరోచియై, నిజధరాప్రోద్దామకీర్తిప్రభా
పటలం బుత్తరభూము లందుఁ బ్రసరింపం జేయ నుత్సాహియై.

తెలుఁగుదేశ మనుచు నెలకొల్పె నొక సంస్థ
యది యెడారి లోన నద్భుతముగఁ
బుట్టి వచ్చి నట్టి బుగ్గయై తృషితప్ర
కోటి మంచెఁ బ్రభుత నీటముంచె 241

వ. ప్రజారాజ్యరాజ్యాంగవిధివిధానంబుగా నిరువదియొక్క యేండ్ల ప్రాయంబునిండిన పల్లీపట్టణ పక్కణ జానపద నాగరికాటవిక సమస్తనరనారీసమూహంబు కలిమి లేములు, కుంటి గ్రుడ్డి, పేద యనద యను విభేదంబు పాటింపక నిజాభిమాననాయకానుకూలంబుగాఁ జీట్లు ముద్రించి లెక్కింపించి సంఖ్యాబలమూలంబుగా నేలిక నెన్నుకొందురు. 242

ఎన్నిక వచ్చె ముప్పదియిదేఁడులు వమ్మె వరించియున్న వా
రెన్నిక చత్తురా యనుచు నిందిర వర్గము విజ్ఞపిఁ(గె, రా
వన్న యనుంగువర్గమె యహర్నిశలుం గృషిచేసి గెల్పు చే
కొన్నది, తెన్గుగద్దెఁ గయికొన్నది, కొన్నది మంది మన్ననల్. 243

వ. గట్టి పట్టుదల వలన రామారావు విజయంబు సాధించె. కానీ యొక్కటి నిక్కువంబు. వర్షాకాలపు నదులకు రాచరికపుఁ బదవులకు స్థిరత్వంబు లేదు. అదియట్లుండె. ప్రొద్దువోయినది. మరలఁ గలియుదము. ఇట్లు చెప్పి యాచార్యుండు సభ చాలించె.

—0—

శ్రీ గాడేపల్లి మల్లికార్జున సుబ్బాంబా కుమార కుక్కుటేశ్వర
ప్రణీతం బయిన ఆనందవల్లి లోని ద్వితీయాశ్వాసము ముగిసినది.

మల్లన్న యొక్క కుమ్మరి
కల్లోలితచిత్తుఁడై యొకానొక నాఁడా
పల్లియ వాసుల కటు గురు
తల్లజుఁడగు బ్రహ్మవేత్త దరి కరిగి యనెన్ 245

"స్వామీ నాబ్రతుకెల్లఁ గష్టములె, యీ సంసార మే నీఁద లే
నే మందోతని చక్తమంచుఁగల" దం చేద్వన్ నివారించి "నీ
కేమైనన్ మతివోయెనే! వెతలు రావేపోవె?" యం చా గురూ
ద్దాముం డిట్లనిచెప్పె నొక్క యితివృత్తం బాతఁ డూఁకొట్టఁగన్ 246

-: బలిరామరాజు కుటుంబవృత్తాంతము :-

కలఁడు కుమారదేవ మను గ్రామమునన్ బలరామరాజు నా
హలికుఁ డొకండు, క్షత్రియగృహస్థు, తదంగన జానకమ్మ ని
చ్చలు సహధర్మచర్యమతి సంస్కృతి నీఁదుచు నిర్వ్యరం కొమా
ర్తైలను గుమారు నొక్కరుని దృప్తిఁగనెన్ బతి యుల్లసిల్లఁగన్ 247

పెద్దపిల్లకుఁ బెండ్లి గావించి పంపె
నీడుజోడైన సంబంధ మేరితెచ్చి
కూఁతు రడుగిడ్డ యత్తింటఁ గొదువలేదు
పాఁడిపంటకు సౌఖ్యసంపదల కెపుడు. 248

రెండవపిల్ల పెండ్లి యొనరించిన బాధ్యత తీఱు, నున్న పు
త్రిం డొక బర్వుకాదు, తన త్రోవన తాఁబఠియించుచుండె నె
వ్వండొ కొమార్తె నిత్తునని వచ్చు సుతుఁడె వివాహమాడు ని
ష్ఠుండిన దెల్లఁ జిన్నినెటులో యొకయయ్య కరాలఁ బెట్టుటే. 249

తిరుగుచుండెఁ దండ్రి తెలిసిన యెడకెల్ల
ఘటన లేకొ గడియ కలిసిరాకొ !
కుదురకుండె నైన వదలక బలరామ
రా జొనర్చుఁ జేతనొ జతనము. 250

వారి బిడ్డ పెండ్లి, వీరిబిడ్డకుఁ బెండ్లి
యనుచు వినుచునున్న యప్పు డెల్ల
జానకమ్మ నీరసంపడుఁ దన దుర
దృష్టమునకు మదిని గష్టపడును. 261

అది గమనించి పెన్మిటి ప్రియఁబున నిట్లను "జానకీ ! యెడం
ద దిగులుపెట్టుకో వలదు నాపలుకుల్ విను మల్లుఁ డేడనో
యిదివఱకే జనించె, మన కింతకు వాని నిజంపుజాడ నె
మ్మది స్ఫురియింప కీపడుశ్రమంబు; ప్రయత్నము లోపమున్నదే?

దానికి జానకమ సమా
ధానపడి "యిఁకట్ల కాక తహతహపడినన్
దేనేర్తుమె సంబంధము ?
పోనిం" డని నిత్యకృత్యముల మున్గిచనున్. 253

కొడుకుండెంగద ! వాఁడు క్రిందిచదువుల్ గూర్మిన్‌సమార్జించి, యి
ప్పుడు పైవిద్యల నభ్యసింప నగరంబుం జేరనున్నాడు; పి
న్నఁడు కాడిప్పుడు, మీసముల్ మొలిచెఁ గంఠం బుద్ధతంబయ్యె వం
గడపున్ నీటునిగారమబ్బె నలవోకల్ హెచ్చె వాచాలతన్. 254

నగరప్రయాణసన్నాహసంభ్రమకుతూ
హలి యైన పుత్రకుఁ దలఁచి తల్లి
"నంపనుఁ డీదన్క ననుఁబాసి దూరదే
శమ్మున నుండిన జాడలేదు
పెందలకడ లేచి పొందికఁగాఁ దన
పనులు దా నవరించుకొనునొ లేదొ !
వేళ కింత భుజించి విద్యలఁ బఠియించి
నెగ్గి రా నేర్చునో నేరఁబోఁడొ

నిదుర మాని రేలు చదువులు సాగించి
పాడుచేసికొనునొ స్వస్థత నట !"
అనుచు బెగడు గుడుచు నారాటపడుఁ దల్లి
డిల్లు, పిల్లవాఁడు వెళ్లవలసి 255

రేపు ప్రయాణమౌననఁగఁ బ్రేమఁదలంచి విశేషభక్ష్యముల్
తీపిపదార్థముల్ సుతుఁడు తిన్నవియన్ని భుజింపఁబెట్టి ని
క్షేపముగాఁ, బరుండు నెడఁ జేరికుమారుని జానకమ్మ యీ
రూపున హెచ్చరించెఁ గొమరుం డభివృద్ధికి వచ్చు నిచ్చతో. 256

"నాయన ! ఎంతగాఁజదివినన్ దగువృత్తి లభింపఁ గష్టమై
పోయిన దీ దినాల నెటు బుద్ధినిగిల్పి పఠింతొ ! విద్యయే
ధ్యేయముగాఁగఁ బెట్టుకొని దీక్షమెయిన్ శ్రమియించి, నాకు మీ
నాయనగారికిన్ ముద మొనర్చుము ! నిల్పుము పేర్ ప్రతిష్ఠలన్ 257

శ్రమపడు మన్న రేపగలుసాగుచుఁ బుస్తకజీవివై పఠిం
పుమనుట కాదు, నీదుచదువున్ మఱి నీసుఖమున్ గ్రహించి, నే
ర్పు మెయి మెలంగుటే, నలఁగి రోగమురొచ్చులు తెచ్చుకోకు, బా
బు ! మనకులమ్ములో నితఁడు ముత్యమురా యనఁ గీర్తిగాంచుమీ.

అల్లరిమూకతోఁ గలసియాడకు ! వీడకు బుద్ధిమంతులౌ
పిల్లలతోడి చెల్మి, వితపెట్టకు కాలము ! మమ్ముఁగూర్చి చిం
తిల్లకు ! నమ్రశీలివయి నీచదువేదొ పనేదొ దానిపై
నల్ల మనస్సునిల్పి చరితార్థుఁడవై యరుదెమ్ము పుత్రకా ! 259

ఎప్పటిపాఠ మప్డు పఠియింపుమురా ! బడిలేనివేళ, మున్
చెప్పిన పాఠముల్ మనసుచేర్చి గ్రహింపుము ! నీతిపద్యముల్
తప్పక కంఠపాఠ మగుదాఁక మథింపుము ! రాకపోవునా
చెప్ప మ దెట్టివిద్యయును ! చేయుకృషిన్ ఫలితంబు కన్పడున్.

నీ విపుడేఁగు పట్టణ మనేకవిధంబుల భోగలీలకుం
దావల, మట్టియిట్టి సరదాలకు లోనయి పాడుచేసికోఁ
బోవకు ముఖ్యమైన చదువుం బ్రియపుత్రక ! యెప్డువచ్చి యె
ప్డేవొక నాల్గురాళ్లు గడియింతువొ యం చిట వేచియుండెదన్" 216

ఆ మాటల్ బలరామరాజువిని "భార్యారత్నమా ! చాలు చా
లామాత్రంబు సుతుండెఱుంగఁడఁటె ! విద్యాదృష్టి లేనట్టి గాఁ
డేమీ యింతగ నూరిపోయుటకు ! వాఁడే నెగ్గిరానేర్చు ని
స్సీ ! మేల్కొవలె వేగువేళ కని పంచెన్ వారి నిద్రింపఁగన్. 262

నిద్ర కొరఁగెఁ దండ్రి, నిద్రించెఁ గూఁతురు
నిద్రపోయెఁ గొడుకు, నిద్ర రాక
అట్టునిట్టు పొరలు చారాటపడుచునె
కడపెఁ గడకుఁ దల్లి పడక-పడక. 263

పెట్టె బేడ సర్ది పట్టణంబున కంపి
రక్కమారుఁ బితరు లాదరమున;
చేరినట్లు బడిని చేరినయట్లును
లేఖ కూడ జాగు లేక వచ్చె. 264

ప్రతిసంసారసుఖాసుఖ
కృతికౌశల కాలపురుష కేళీలీలా
కృతములు చూచుచు నుండఁగ
గతియించెను గొన్ని నెలలు కడుఁద్వరితముగన్ 265

జానకమ్మ కౌమార్తె కళ్యాణవిషయ
నిస్సహాయత కంతంత కుస్ఫురనుచుఁ
దెగని యాలోచనమ్మునఁ దెగని బెడదఁ
గొంత స్వస్థత చెడఁగొట్టుకొనెను గూడ. 266

బలరామరాజు భార్యకుఁ
బలుతెఱఁగుల ధృతిని నచ్చఁబలుకుచు నున్నన్
నిలువని మనసున నొక నాఁ
డెలుఁగు కలఁకవాఱ భర్త కిట్లు వచించెన్ 267

"పెన్మెత్సవారు మీ పిల్ల యెత్తరియుఁచుఁ
జెప్పించి చల్లగాఁ దప్పుకొనిరి,
ఆ దంతులూరి వా రదెవత్తు మిదెవత్తు
మనుటయే కాని వచ్చినది లేదు,
దాట్లవారో వారి తనయకుఁ బెండిలి
సేయక సుతునకుఁ జేయ మనిరి,
సాగివా రిఁకసరే జాతకమ్ములు నప్ప
లేదంచు నాన్చి తేలిచిరి కొనకు,

ఒకరి కవ్వాయి చేయు నుద్యోగదృష్టి,
ఒకరి కెనలేని కట్నకానుకల యాశ
ఇంక నెక్కడఁ బెండ్లి కావింపఁ గలము ?
మదుటఁ గళ్యాణరేఖ యున్నదియొ లేదొ !" 268

కంటఁ దడివెట్టు గృహిణిని గని గృహస్థుఁ
"దుఃడు ! బోడసకుబ్జులో నున్న వాఁడు
మాకు మిత్రుఁడు మనవాఁడె మంచివాఁడు
వెళ్లివచ్చెద నేవొ చెప్పినను జెప్పు." 269

అని యొక సుదినోదయమునఁ
జని బోడసకుబ్జు తనదు సఖునింగని, వ
చ్చినపని వివరంబుగఁ జె
ప్పిన మిత్రుఁడు రాజుతోడఁ బ్రియమున ననియెన్. 270

"నా కొమరుండె యుండె నయినన్ బడిపంతులు, మాపొలాలు తా
నే కనిపెట్టి నాకు ననునిత్యము సాయపడున్, మఱేవొ యే
వో కొని చూచివచ్చితిమి, యొక్కటి కుబ్జకునచ్చలేదు, నీ
రాకకు నంతరార్థము పరాత్పరు నిర్ణయమేమొ చూడఁగన్". 271

బలరామరాజు మిత్రుని
పలుకులకున్ సంతసించి బ్రాహ్మణు నొకనిం
బిలిపించి పెండ్లిచూపుల
కెలమి ముహూర్తమ్ము నిర్ణయించుకొని చనెన్. 272

వారలు పెండ్లిచూపులకు వచ్చుట, కుబ్జకుఁ బిల్లనచ్చుటల్,
గౌరవదృష్టిఁ గట్నములు కానుక లన్నవి తేలిపోవుటల్,
కోరిన మంచిలగ్న మొనగూడుట, యన్నియుఁ జూచుచుండఁగా
తీరిచిపెట్టినట్లమరె దేవుదయన్ గృహసభ్యు లుబ్బఁగన్. 273

వ. ఇది యిట్లుండ 274

పట్టణపాఠశాలఁ జదువన్ జనినట్టి సుతుఁడౌ విద్దియల్
నట్టుచుఁ దొంటి బుద్ధికుశలత్వము వాసె; పరీక్షఁదప్పె న
న్నట్టి కువార్త వచ్చెఁ బిత యాత్మఁగలంగి కుమారు మంచియున్
జెట్టయుఁ జూచివత్తమని శీఘ్రమె యన్నగరానికిం జనెన్. 275

రాత్రి ప్రొద్దుపోయి పుత్రుండు గదిచేరె
వెంట మిత్రు లిర్వు రంటి నడువ
"నాన్నగారు వచ్చినా" రనెఁ మిత్రుండు
మెల్ల మెల్లఁ గదలె మిత్రయుగము. 276

అప్పు డిప్పు డనక యటువచ్చి యిటువచ్చి
కొడుకు చెల్మికాండ్రు కూరుచుండ్రు
పోవుచుండ్రు - బడికిఁ బోవుదు మని పోయి
గంటలోనె తిరిగి యింటివద్ద. 277

కొన్ని దినంబు లుండి జనకుం డిలుచేరెఁ గుమారుఁ డక్కడె
ట్లున్నది చెప్పుఁడం చడిగె నొద్దిక జానకి; చెప్పె భర్త "యే
మున్నది ! నీ సుతుండు సుఖముండెఁ దదాప్తసఖుల్ సుఖుల్ సదా
క్రొన్నపులాటలున్ కబురులున్ తిని తుష్టిగ కాలయాపనల్. 278

చలనచిత్రక్షేత్ర సరససంభాషణల్
తారకనామమంత్రంబు లయ్యె
దూరదర్శినిసహోత్సుకదర్శనాపేక్ష
నిండైన కన్నుల పండు వాయె
చిత్రరంగప్రవేశివినూత్ననటనటీ
మదగతుల్ వల్లించు చదువు లాయె
క్రీడాకళారంగసాడంబరప్రసం
గము పాఠ్యభాగసారముగ మారె

పుస్తక మొకింత తెలువఁగ బుద్ధి పోదు,
దృష్టి నిలకడగా నున్న తీరు లేదు
చెడ్డయూహల నేమైనఁ బడ్డవాఁడొ !
పొలఁతి ! లేకున్న వాడు తప్పునె పరీక్ష !!" 273

మగని యంతరంగమథనమ్ము గమనించి
జానకమ్మ "చాలుచాలు! దీని
కింత చింత యేల? యేదొ వయ స్సేను
వ్రాసెదఁ గద యుత్తర" మ్మటంచు 280

"శ్రీరస్తు! మా చిరంజీవుల దీవించి
మీ యమ్మ జానకి వ్రాయు లేఖ-
నీ క్షేమవార్త తండ్రి వచింపగా వచ్చి,
విని సంతసించితిఁ బ్రియకుమార!
చదువుపై మతికొంత శ్రద్ధపెట్టి పఠింపు
మెప్పుడు లేనిది తప్పితి వఁట,
పెద్దక్క యీవార్త విన్న నెంతగ బాధ
పడునో యత్తింట బేల్పడఁగ వలసి,

కష్టసుఖములు నీ వెఱుంగనివి కావు;
ఏమి చెప్పిన నీ మంచికే గదయ్య!
ఇంతె సంగతు, లుందు, గ్రహింప వలయు
నిట్లు, మీతల్లి-" యని ముగియించె వ్రాలు. 281

తనయుఁ డయ్యుత్తరం బందుకొని పఠించి
చేయి కాలాడ కొక్కింత సేపు నిలిచి
మరలఁ జదువుచు మఱిమఱి తిరుగఁ జదివి
ఉస్సురని తద్ద తర్కించె నుల్లమందు. 282

"నన్ను గుఱించి యమ్మ యనునా యనయున్ మఱియొండు దృష్టితో
నున్న తెఱంగు కన్పడె నెటోకద వారికి నచ్చఁజెప్పుటల్!
కొన్ని యవాంతరంబు లనుకొని విధంబునఁ జుట్టుముట్టి పై
కొన్నవి నిక్కువమ్మె. ఇదిగో నిఁక మేల్కొనెదన్ శ్రమించెదన్. 283

అని దృఢనిశ్చితాత్ముఁడయి యప్పటినుండి తదన్యదృష్టియన్
ఘనకపి కాత్మశక్తి యను కట్టను జూపుచు, శ్రద్ధయన్ వనం
బున సముపాస్యవిద్య యను పూజ్యఫలంబును దక్కఁ గోసికో
మొనసి చరించె జానకమపుత్రుఁడు దూరనిరుద్ధమిత్రుఁడై 284

చలనచిత్రవినోద సంభాషణములకు
బదులాడి యాడని పగిది మెలఁగు
దూరదర్శినిఁ జూడఁగా ర మ్మనిన గ్రుడ్లు
పీకుచున్న వటంచుఁ బోక మాను
చిత్రనటీనట శృంగారచేష్టల
కౌకనవ్వు నవ్వి తప్పుకొని తిరుగు
క్రీడావిశేషవాగ్వృత్తి తటస్థింప
మూకొట్టి పొడిగింప కూరకుండు

నెచ్చెలులు పన్ను కొఱగాని యుచ్చులందుఁ
బడక, యిటు పడకున్నట్లు బయటపడక
చతురుఁడై కొన్ని దినములు జానకమ్మ
కొడుకు గడపెను కత్తిపై నడక వోలె, 285

వలువఁ దడిపిన వాన జల్లులుగఁ జేరి
తామరాకున జలబిందుతతిగ మాఱి
క్రాగిన పెనాన నీటిచుక్కలుగ సిగిరి
క్రమముగాఁ దొంటి మిత్రసంఘంబు విరిసె. 286

వ. కుమారుని వ్యవహారం బీ రీతి నుండ 287

పెండ్లి కుదిరినట్టి పిల్ల వివాహంబు
శ్రావణంబునందు జరుపవలయు.
సరిగ నొక్క మాససమయంబు నడుమను,
నాతురపడు చుండి రా పితరులు. 288

వంటవాడు, మండపస్థలి, బాజాబ
జంతిరీలు, లగ్గతంతు నడపు
బాపనయ్య లన్ని వడివడి సమకూర్చు
కొనఁగ వలయుఁ బెండ్లి పనులకు దిగి. 289

అంతటి లోనె వచ్చిపడె నాపద, పెద్దకొమార్తె భర్త తత్
ప్రాంతపురాంగణానఁ దన బండిపయిం జనుచున్ హఠాత్తుగా
గుంతను దప్పుకోఁగడఁగి గ్రుద్ది బృహత్తరవాహనంబు న
య్యంతికశీఘ్రగామి నకటా ! పడె గాయములై ముఖమ్ముపై. 290

పిడుగు వంటి వార్త విని రాజు మూర్ఛిల్లెడె
భార్య కూలి నెత్తి బాదు కొనియె;
చేతనున్న సొమ్ము శీఘ్రమ్ము కైకొని
వైద్యశాల కపుడ పయన మైరి. 291

అల్లుఁడుగారు మోముపయి నంతటఁ గట్టిన కట్లతోడ శో
షిల్లి స్పృహేతరుండయి కృశించి పరుండె కొమార్తె భర్తృప
త్పల్లవసన్నిధిన్ నిలిచి తత్పరిచర్య యొనర్చుచుండెః హా !
గొల్లున నేడ్చెఁ బుత్త్రి జనకున్ జననిం గని పట్టరానిదై. 292

జనకుఁ డోదార్చె, బుజ్జగించినది జనని
చెప్పెఁ బుత్త్రిక "మొగమెల్ల చీలిపోయి
పడెను పదికుట్లు-కనులు దెబ్బతినె నేమొ !
యేమి చెప్పుదు ? నా కర్మ మిట్లు కాలె". 293

జానకి భర్తతోడ ననె "స్వామి ! యిదెక్కడ ? మొన్నదాఁక న
మ్మాడి వివాహచింత, యొకమార్గము చిక్కినయంతలోనె యు
వ్వాని పరీక్ష తప్పినకువార్త, సుతుం డొక దారిరాఁగ నీ
లోననె యిట్టు లల్లునకు ! లోపము లేడ నొనర్చియుంటిమో !" 294

బలరామరాజు లిట్లని
"రిల జన్మించిన మనుష్యుఁ డెల్లపుడు సుఖం
బుఁ గా ! యెల్లప్పుడు కష్టం
బుఁ గొ కలుగఁడు - రెండు వచ్చిపోవుచు నుండున్. 295

అన్నవస్త్రాల కొదువ లేకున్నఁ గాని
యాలుమగ లెంత యన్యోన్యలీల నన్న
నాగిపోవని సంసారయాత్ర లోన
నేదొ యొకచింత జీవుని నేడిపించు. 296

కష్టసుఖముల నొక్క మార్గమునఁ జూడ
నేర్చె నేనియు నదిలెస్స, నేరకున్న
వానికవె వచ్చిపడియెడు ద్వంద్వములను
దైవనిర్ణయ మని తలఁ దాల్పఁ దగును". 297

వ. కొన్ని దినమ్ములు గడచె.

అల్లుఁడుగారు కోలుకొని, రాత్మజ పెండ్లి విశేషవైభవో
త్సుల్లముగా ఘటిల్లె, నిజపుత్రుఁడు విద్యల నెగ్గివచ్చె, నూ
రెల్లను రామరాజు గృహమే గృహమంచు నుతించెఁ గాన నో
మల్లన ! కష్టసౌఖ్యములె మానవజీవిత మం చెఱుంగుమీ !" 298

అని మల్లన్నకు బ్రహ్మవేత్త గృహివృత్తాంతంబు విన్పింప మ
ల్లన "యౌలెం"డని యూరకుండె నిదియెల్లన్ విన్చు నచ్చెంత నుం
డిన గ్రామస్థుఁ డొకండు తేల్చె "నగు నేనిన్ సర్వసంగంబు వీ
డిన సన్న్యాసి యొకండెపో సుఖి నిరూఢిన్-ధారుణీమండలిన్" 299

అనవుడు బ్రహ్మవేత్త నగి "యట్టిద, కష్టతమమ్ము సర్వమో
హనిరసనమ్ము. తొల్లి కుముదాంబరుఁ డన్ జటి భ్రాంతుఁడై కరం
బును విఱుగంగఁ గొట్టుకొనె మోహిత "నా" నతఁడెవ్వఁ డేకతం
బున విఱిగెన్ కరమ్ము ? తెలుపుం" డనె నాతఁడు, తెల్పిరగ్గురుల్.

-: కుముదాంబరుఁ డనెడు సన్న్యాసి మోహాక్రాంతుఁ డగుట :-

అమరావతీ పురమ్మునఁ
గుముదాంబరుఁ డనెడు భిక్షుకుం డొక్కఁడు బా
ల్యమునుండి వెఱచి సంసా
రముకర ముఖపతన దుర్భరత కిట్లెంచున్. 301

"అలను మోహవారినిధియందు మునింగి గృహస్థుఁ డెంతకుం
దేలక శ్లేష్మమక్షికగతిం జెడుఁ దత్సతి వల్ల బాలురన్
బాలలఁ గాంచు, వారలకుఁ బ్రాప్తిలు రోగమురొచ్చు లాపదల్
చాల మనోవ్యథం గొలుప సంశయచిత్తముసం గృశించెడున్ 302

తన విషాదము చాల దనుకొన్న యట్లుగా
భార్యావిషాదమ్ము పంచి కుడుచు,
తన యాతనలు చాలవనినట్లు బిడ్డపా
పల యాతనలకు భావమునఁ గలఁగు
తన కష్టములు చాల వనినట్లు బంధుమి
త్రుల కష్టములను నెత్తదల ధరించు
తన పాట్లు తనకుఁ జాలనియట్లు గొడ్డుగో
దల పాట్లు తనపాట్ల వలె భరించు

హాయియ్యెలోఁ బిల్లి లేవని పూటఁ బొగులు
తఱుగక లభించు సంపదల్ దాఁచ దిగులు,
కడకుఁ దగులమె కాని సౌఖ్యమ్ము లేని
జీవితము సుమ్ము సంసారి జీవితమ్ము. 303

ఆది మధ్యాంతముల సుఖ మ్మారటమ్ము
చింత గలయట్టి గృహమేధి జీవితమ్ము
కంటె నిస్సంగతయె సౌఖ్యకర మటంచుఁ
గాలమును బుచ్చు నమ్మునికల్పుఁ డెపుడు. 304

మాధవకబళము తల్లీ!
మాధవకబళ మ్మటంచుఁ బలుచు గృహిణుల్
సాధుమతి సిద్ధ యన్న వా
నాథులకుం బెట్టి తిను ననంతర మతఁడున్ 305

కల వారల్ కనకంపుఁగంచముల భోగప్రౌఢి భక్షింప వా
రల యార్భాటము చూచి నవ్వుకొను, వైరాగ్యంబు సూచించుఁ జే
తులకున్ మించిన పాత్ర మేదనుచుఁ దృప్తుండై భుజించున్ గరాం
జలియే విస్తరిగాఁగ నాఁకటిని బుచ్చున్ స్వల్పమాత్రంబుగన్ 306

ఒక రాతిరి భిక్షాటన
సకలమ్ము ముగించి, కుడిచి, సత్రమ్మున ని
ద్రకుఁ జొచ్చి బయలి యరఁగున
నొకయించుక మేను వాల్చి యున్నట్టి తఱిన్ 307

ఎదురింటి భాగ్యశాలులు
ముద మొదవ వివాహకార్యమునుగొని నడుపన్
విదితమగు తద్గతోత్సవ
విధమునకున్ సుంత చిత్తవిభ్రమ మగుడున్. 308

ఏమీ పెండిలి చేసికొంటయు సుఖంబే, తోడునీడౌచుఁ దా
భామారత్నము వచ్చు, వండి తరికిన్ వడ్డించు, శ్రాంతుండఁగా
నోమున్ బాదములొత్తి బంధుసఖివర్యుల్ వత్తురున్బోదు'' రం
చేమేమో తలపోసికొం బొరిగిపోయెన్ నిద్దురన్; నిద్దురన్ 309

కలగాంచెన్ కలలోన నాతనికి వేడ్కన్ బెండ్లియైపోయె, కొ
త్త లతాదేహయు వచ్చి యయ్యరఁగుమీఁదన్ ప్రక్కనేర్వాలె, వ్రా
లి, లసన్మోహనమోహనాకృతివచోలీలన్ ప్రియున్ దన్పి య
ల్లల నిట్టట్టులఁ బొర్లుచుం బలుకు నయ్యర్ధాంగి ప్రాణేశుతో. 310

జరగుఁడు జరగుఁడు ! కొంచెము
జరగుం డిఁకఁగొంత జరగుజరగుం" డనుచున్
జరగింప నతఁడు జరగుచు
జరగుచుఁ దుట్టతుద కరఁగు జారిపడె భువిన్. 311

వ. పడి కుడికేలు విఱుచుకొని త్రుళ్లిపడి, 312

కన్నులువిచ్చి పెండ్లియును గాదిలిపెండ్లము మిథ్యయౌట, కే
లన్నది తన్గుటో నిజమునౌట యెఱింగి యనంగహేతుకా
పన్నత ఖిన్నతంబొగిలి "బాపురె స్వప్నములోని యింతియే
నన్నిటునొంచెఁ గట్టుకొనినన్ నిజమౌ సతి యెంతనొంచునో!" 313

అని వగచి శల్యవైద్యుం
డను వాఁడెచ్చోట దొరకునా యను చింతన్
జనె, వినుఁ డీ సంసారం
బున సౌఖ్యము లేమి నిజము ముమ్మాటి కిలన్. 314

వ. అని యి ట్లాచార్యుండు కుముదాంబర పరివ్రాజక వృత్తాంతంబు వినిపించిన విని, యచ్చేరువన యున్న చాకి యొక్కండు డొక్కింత నిట్టూర్చి బ్రహ్మవేత్తతో నిట్లనియె. "అయ్యా! సత్తెము పలికితిరి. నా బ్రతుకట్టె తెల్లవాఱె. తెలిసి తెలిసి నే నెవ్వరి కపకారము చేయలేదు, కానీ నావాఁడే నన్ను ముంచె నే మని చెప్పుకొందు? 315

నే బట్ట లుతికి యెటనెట
నో బంటుగఁ గుదిరి దాచి యుంచిన పైకం
బేఁబదివే లవసర మని
నా బావమఱంది మును ఋణంబుగఁ గొనియెన్ 316

'పత్తరము' వ్రాసె "ఇదిగో
నిత్తు నదిగొ నిత్తు ననుచు నిన్నాళ్లును న
న్నెత్తెఱఁగు త్రిప్పి, కాఁపుర
మెత్తివయిచి యుఱికె నెటకొ ! యేమని చెప్పన్ 317

మొన్న నూడిపడియె, "నిన్నాళ్లు నెచటరా ?"
యనిన "పొట్ట కూటి కరిగితి" ననె,
సొమ్ము నడుగ లేదు పొమ్మనెఁ గాలదో
షమ్ము పట్టెఁ బత్రసాక్ష్యమునకు. 318

నా పిల్ల పెండ్లి కెదిగిన
దా పైకం బుంచికొంటి ననుకొంటి నయో !
దోపిడి యైపోయిన దిఁక
నీ పిల్లకు నేను బెండ్లి యెట్లొనరింతున్ ?" 319

వ. అని యుమ్మలించు నమ్మడేలునకు బ్రహ్మవేత్త యిట్లనియె. 320

న్యాయస్థానము పైఁత మెద్దియును జేయంజాల దిప్పట్లఁ బ
త్రాయుర్దాయము చెల్లెనంటి విఁక వాఁడైవాఁడె యేకాంతసా
మ్మో యాత్మన్ తన యప్పుద్రవ్యమును సద్బుద్ధిన్ సమర్పించినన్
నీ యాదృష్టఫలంబు, లోక మన నింతే దక్కినన్ బొక్కుటల్. 321

ఎవఁడు చేసిన నియతియో ! యీయనర్థ
నియతి, పత్రము మూఁడేఁడ్లు నిండఁగానె
చచ్చుటేమి ? ఋణగ్రాహి చచ్చువఱకు
బ్రతికియే యుంట ధర్మము పత్రసాక్షి. 322

అది యట్లుంచుము ; ద్రోహబుద్ధికి జయంబైనట్లు కన్పించు ము
మ్మొదటన్ బిమ్మట వాఁడు దెబ్బనుదినుంబో లేవలేఁడింక, ని
య్యదె చూ ; భారతనీతి, మాయఁజయులబ్ధైశ్వర్యసద్ధార్తరా
ష్ట్రదళం బంతయు మందు దిక్కుచెడి పోరంజచ్చె దైన్యస్థితిన్. 323

వ. అదియును గాక, 324

కౌరవులు ద్రౌపదికి నప
కారము తలపెట్టి, వారికాంతలకే వా
కోరాని కలఁక తెచ్చిన
వారైరల ద్రుపదపుత్రి వస్త్రాపహృతిన్. 325

వ. అది యెట్లంటిరేని వినుండు ; ఈ వృత్తాంతంబు శ్రీరామ
శరణోపనామ సుప్రసిద్ధులైన కుందుర్తి నరసయ్య మహాశయు
లుపన్యసించినది. 326

–: ద్రౌపదీవస్త్రాపహరణవేళఁ గౌరవపత్ను లవమానపడుట :-

ద్రౌపది నట్లు జూదమున ధర్మజుఁ డోటువడన్ సుయోధనో
ర్వీపతి యట్టహాస మొనరించుచుఁ దమ్ముని దుస్ససేను నా
జ్ఞాపన పెట్టి నిండుసభ కన్గొనఁ బాండవపత్ని కింక వ
స్త్రాపహృతిం బొనర్పుమని యక్కట యెక్కడి రాక్షసేచ్ఛయో ;327

సభకున్ జూదము చూడవచ్చిన కురుక్ష్మానాథు కోడండ్రు తత్
ప్రభు దుర్యోధను క్రూరనిర్దయహఠాద్భావింతాత్ములై ద్రౌపదీ
శుభవృత్తంబు కళంకితం బగుట కచ్చో వెచ్చ నిట్టూర్చి భ
ర్తృభయాలన్ వెనుకాడియున్ దలఁచి నీతిన్ ధీరచేతస్కలై . 328

తోడికోడండ్రకు తొంబదితొమ్మి దిగురు
కలసికట్టుగఁ బెద్దక్క కడకు నడచి
"అకట ! ఘోరము ! బావగారికిని జెప్పి
మాన్పు తక్షణ మీ దిక్కుమాలిన పని". 329

వ. అని మొగములు చిట్లించిరి. 330

ఆ నిందోక్తులు విన్న భానుమతి రోషావిష్టయై "మొన్న హా !
నా నాథుండెదొ సుంత యమ్మయసభన్ దార్మార్వడన్ ఫక్కుమం
చీ నారీతిలకంబె చూచినగె నవ్వేమైతి ? రీ నా డిటుల్
దానిం బ్రోవవె యంచు వచ్చితిరి ! చాలన్ నాథు వారింపఁగన్. 331

అని తేల్చి తాను కూర్చుం
డిన పీఠము నుండి లేచి డిగ్గన నన్యా
సనవిశ్రమయై వగ నొరి
గిన, భానుమతక్క కోపగించిన దనుచున్. 332

వ. ఏరాండ్రు మారాడ నేరక విషణ్ణహృదయంబుల నిషణ్ణలై
మిన్నకుండ్రి. 333

ఆ దుశ్శాసనుఁ డగ్రజాజ్ఞగొని వీరావేశముం దాల్చి, సా
ధ్వాదబ్జాక్షుని కూర్మిచెల్లెలి శిరోజాతంబులం బట్టి నా
నాదుర్భాషల నీడ్చితెచ్చి సభలోనన్ నిల్పి యమ్మేని యా
చ్ఛాదంబై మను నొంటివస్త్ర మొలువన్ సంసిద్ధుఁడై లేచినన్. 334

హా కృష్ణా యని కృష్ణ చేసిన యనాథాలాపన మ్మార్తర
క్షాకర్తవ్యుఁడు నవ్యయుం డఖిలలోకవ్యాపకుం డంతలో
నాకర్ణించి, యఖండ స్త్రీవసనచిత్రాకారముం దాల్చి యా
హా కురతిస్నుష కట్టుచీరపయిఁ బాయంబోక నిల్చెంగృపన్. 335

"అమ్మయ్యో" యనె భీష్ముఁడు
"తమ్మయ్యో లాగులాగు త్వరగాఁ ద్వరగా
నిమ్మదవతి వలువల నని
పమ్మిన రోషమునఁ గౌరవప్రభుఁ డఱచెన్. 336

వెండియు దుశ్శాసనుఁ డు
ద్దండభుజాదండముల ప్రతాపము మెఱయన్
గొండొక సందీయక ని
ల్చుండి యొకేకడఁకఁ జీర లొలుచుచు నుండెన్. 337

ఒక వస్త్ర మొలువ వెస వే
ఱొక వస్త్రం బవతరించుచుండె ద్రుపదపు
త్రిక చీరపైనఁ గృష్ణ
ప్రకటిత వస్త్రావతార రమ్యాకృతులన్. 338

అది యిది నాక, యస్తి యనినట్టి పదార్థ మదెల్లఁ దానయై
యొదవెడు దేవదేవుఁడు మహోన్నతుఁ డే యవతారవర్తనన్
విదితుఁడు కాఁడొ ? యజ్ఞులయి విజ్ఞులు పల్కెద రంతెకాని, హా
పదిగిది యంచు హద్దు నిడవచ్చునె ? యయ్యవతారసంఖ్యకున్. 339

వనజాతేక్షణుఁ డట్లు దాల్చిన మహావస్త్రావతారంపుటం
డన యమ్మానిని పర్వు తా బ్రతికిబట్టంగట్టె, దుశ్శాసనుం
డనుమానింపఁడు, స్వప్నవృత్తము లసాధ్యక్రీడ లాశ్చర్యసం
జనకంబుల్ మఱి కానియట్లె మెలఁగున్ శశ్వత్పటాకర్షణన్. 340

అన్నగారి కేడ నవమాన మౌనొ యం
చలసి సొలసి కూడ నా ఖలుండు
బింక మెడలనీక పంకజముఖి యొంటి
వలువ లొలుచు చట్లె నిలిచి యుండె. 341

వచ్చిపడుచుండెఁ గుప్పకుప్పలుగఁ జీర
లద్భుతంబులు, రమ్యరమ్యములు, చిత్ర
చిత్రములు, మృదుమృదువులు జిలుఁగుజిలుఁగు
వన్నెవన్నెలు మాధవప్రతికృతులయి. 342

అవి సాక్షాద్భగవంతు కృష్ణు నవతారాంశంబులున్, దివ్యవై
భవసంపన్నము లత్యపూర్వములు, లోభప్రేరణమ్ముల్, మహా
ఛవిమంతంబులు, ప్రాంతమానవదృంగంచద్విభ్రమంబుల్, విశి
ష్టవిశిష్టంబులు, కౌరవావళి కరిష్టంబుల్, స్త్ర్యభీష్టంబులున్. 343

వానిపైఁ గన్నువడెఁ గౌరవప్రియలకు
దినదినవినూత్నవస్త్రధారణచణలకు
రాణులకు నూర్వురకు; వేగ లోని వాంచఁ
బిలిచి యొక దాసి చెవిఁ బడవేసి రంత. 344

ఆ దాసి హుటాహుటి నపు
డా దుశ్శాసనుని డాసి యనె ని"ట్లీవ
స్త్రాదులను గట్టుకొన నా
హ్లాదం బొదవెనఁట తమ మహారాజ్ఞులకున్" 345

కహకహ నగి దుశ్శాసనుఁ
"డహహా! మేల్మేలు! చేతి కనువగు కుప్పల్
గ్రహియించి పొమ్ము! మా మా
మహిళల కందిమ్ము వైళమ" యనుచుఁ బనిచెన్. 346

దాసి తెచ్చిన మహితవస్త్రములఁ గాంచి
కౌరవార్ధాంగు లత్యంతకౌతుకమునఁ
జేతఁగొని యొంటిమీఁద వైచికొని చూచి
బలెబలే యంచు నొండొరుఁ బిలుచుకొనుచు 347

అక్కా యిటుచూడవె! చి
న్నక్కా యిటుచూడు! చెల్లియల యిటు కనవే!
యిక్కోక నాకు నప్పిన
దోక్కో చెప్పఁగదె" యంచు నుత్సుక వతులై. 348

కిలకిల బిలబిల లాడుచుఁ
జెలువలు చెలువంపుఁ గ్రొత్త చీరలఁ బ్రక్కం
గల గదులలోని కర్మిలి
వెలయం గొనిపోయి చేరవేసిరి తలుపుల్. 349

కట్టుకొని యున్న చీరలఁ
దిట్టుకొనుచు విప్పివైచి దివ్యములగు క్రొం
బుట్టములఁ జేతులం గొని
యిట్టట్టులఁ ద్రిప్పి మెచ్చి రెలమి నెలంతల్. 350

నడుము కుడికెలనఁ గోకన్
ముడియిడి చుట్టుకొని యెడమ బుజమునఁ బైటం
బడవైచి కూర్చి పొక్కిలి
కడఁ గ్రుచ్చిరి కుచ్చెళులు సొగసు లుట్టిపడన్. 351

లలనల్ చీరలుగట్టఁ, గట్టురవికల్ మాయుంబులై క్రొత్తరై
కలు విచ్చెసెఁ దదంగనారుచిరవక్షఃపాళిపై మేని చీ
రలకున్ నప్పిన వర్ణమార్దవసమర్థంబుల్, వెసం గాంచి కాం
తలు గర్వించి పతివ్రతామణుల మన్నన్ మేమె సుమ్మీ యనన్.

ద్రోవది మేనిచీర లిఁకఁ దొల్చుట యాతని చేతఁగా కహం
భావము వాసి తత్ఖలుఁడు భంగపడెన్, ద్రుపదాత్మజాత సం
భావితయయ్యె. కృష్ణభగవానుఁడు నయ్యవతార మంతటం
బోవిడెఁ దత్క్షణం బెగిరి పోయెను గౌరవదారవస్త్రముల్. 353

గొల్లుమని రాజకాంతలు
కల్లోలిత లైరి మదులు, గదులం దొదుఁగన్
జెల్లాచెదరై పఱచిరి
యెల్లరు మగవారు మొగము లెత్తఁగ జంకన్. 354

వ. వింటివికదా ద్రౌపదీవస్త్రాపహరణ మెట్లు పరిణమించినదో! కావున నోయీ! యొక్క సత్యంబు గ్రహింపుము. 355

పరుల కొరక కీడు తలపెట్టు నరుఁడు తానె
పొరయుఁ గీడును: నీ భావమదేది యట్లె -
అది యెదో వచ్చిపడినప్పు డర్థ మగును
దేని ఫలమేదొ యాపూఁటఁ డెల్లమగును. 356

వ. అది యట్లుంచుము: 357

నీ మంచి తనము, నీ సుత
శ్రీమత్సౌభాగ్యరేఖ చేరి కలిసెనా
నీ మొగసాలకె తను దా
నై మఱి యల్లుండె వచ్చి యడుగును పిల్లన్. 356

వ. అని యిట్లు బ్రహ్మవిదుండు చాఁకలి నోఁదార్చి కడచినది యొక్క పీడకలగాఁదలంచి యూరడిల్లుమని యుపదేశించె నప్పుడు,

కడచిన దొక్క పీడకలగా గ్రహియింపు మటన్న యొజ్జ పె
న్నుడివిని "వింతవింతలు గనుంగొన స్వప్నము లే విధాన నే
ర్పడునవి? వానిచే నొదవు లాభమదేమి?" యటంచు నైశ్యవృ
ద్ధుఁడొకఁడు బ్రహ్మవేత్తఁ దమితో నడిగెన్ వివరించి చెప్పఁగన్.

---

శ్రీ గాడేపల్లి మల్లికార్జున సుబ్బాంబా కుమార కుక్కుటేశ్వర
ప్రణీతం బయిన ఆనందవల్లి లోని తృతీయాశ్వాసము ముగిసినది.

# చతుర్థాశ్వాసము - దళము

వ. బ్రహ్మవేత్త సభాసదుల కిట్లనియె. 361

-: స్వప్నస్వభావము :-

మన మిత్రుం డొక పృచ్ఛ చేసెఁ గల లెమ్మాడ్కిన్ ఘటిల్లున్? ప్రయో
జన మేమంచు, వినుండు : నిద్రన మనస్సంచారమే స్వప్న, మా
మన సజ్జీవుని సూక్ష్మదేహమున సంప్రాపించి ప్రత్యక్షవ
ర్తనముం బోలిన వర్తనంబు నెఱపున్ దచ్చేష్టయే స్వప్నమౌ. 362

వ. స్థూలసూక్ష్మకారణభేదంబుల చేత శరీరంబు త్రివిధంబు. వ్యక్తమై యున్న యీ శరీరంబు స్థూలంబు, స్వప్నావస్థలయందు సంచరించునది సూక్ష్మంబు, కర్మానుభవంబు జీర్ణించుకొని యమభట గృహీతమై చనునది కారణంబు. అది యట్లుండ, 363

మెలఁకువ నున్నప్పుడు మ
ర్త్యులకుం గొని యనుభవములు రూఢము లగు, ని
ద్రల నయ్యనుభవములను
ద్రలు మనసు వహించి స్వప్నతత్త్వము నొందున్. 364

ఒక్కొకని కెగురు చుండిన
పక్కిఁ గలలు వచ్చుఁ బూర్వభవముల నెపుడో
పక్కి యయియుండు; వాసన
లక్కరణిం దిరుగు మనసు నవి వదలమికిన్. 365

ఇల దుర్ఘటకార్యంబులు
కలలో సంఘటిలి తృప్తి గల్గించు; సమ
స్యల కొక్కొక తఱి నుత్తర
ములు దొరకు నొకొక్కతఱినిఁ బొడము సమస్యల్. 366

కరచరణాదిక విగ్రహ
విరహితు లగు దేవతలును పితృదేవతలున్
నరులఁ బలుకరింపఁగ నుప
కరణము లీ కలలు, సురలఁ గనమే కలలన్! 367

కలను భవిష్యసూచకముగా వివరించె శివానికిన్ శివుం
డెలమి నొకప్పు డంతవఱ కెందుల కేఁ గనినట్టి కొన్ని య
క్కలలు యథార్థమై చనుట కన్పడె, నిగ్గతి స్వప్నకారణం
బులు పలుభంగు లేవా కొని బుద్ధికిఁ దోచిన వాని దెల్పితిన్. 468

కలగాంచెఁ ద్రిజట లంకాపట్టణం బెల్ల
వానరక్రోధవిధ్వస్త మయ్యెఁ
గవి తిక్కనకు నొక్క కలవచ్చె భారత
గ్రంథానువాదసంఘటన జరిగె
కలవచ్చెఁ గృష్ణరాయలవారి కాముక్త
మాల్యదాకావ్య నిర్మాణ మొదవె
'సీజరు' సతికి వచ్చిన దొక్క కల, భర్త
మఱునాడు సభ కేగి మరణ మొందె

నేఁటికిని గూడ లోకుల నోట వినమె
యదిగొ కలవచ్చె నిదిగొ నిట్లయ్యె ననెడి
వాస్తవమ్ములఁ గాన స్వప్నమ్ములకును
ఘటనలకు నేదొ యొక కొంత కలదు లంకె. 369

వ. వేయేల ? నాయనుభవములోని యొక్క స్వప్న సంఘటన వివరించెద వినుండు! 370

నేను నిడదవోలులో నున్న దినముల
నొక్క కలనుగంటి నక్కలఁ గల
వృత్తసంవిధాన మేనట మున్నెప్పు
డదిని దలఁచి యుండి నదియుఁ గాదు 371

గోలింగశివ వేణుగోపాల సోమేశ్వ
రస్వామి లేయూరి రక్షరేఖ
లిక్షుకేదార ధాన్యక్షేత్ర సీమ లే
పట్టణాంగన కాకుపచ్చ కోక
పురమధ్యపురబహిస్స్థిరవస *న్నంగాల
కోటసత్తెమ్మ లే వీటి సురలు
శ్రుతధూమశకట ఘుక్ఘుక్శబ్ద మే గ్రామ
నటికి దివారాత్ర నాట్యలయలు

శుభదగోదావరీవారివిభవఖనులు
కాల్వ లే ప్రోలి కంఠానఁ గల్వసరులు!
అదె వెలుఁగొందు నగరాల కగ్రమందు
నిడుద సిరిసంపదలఁ దేలు నిడదవోలు 372

వ. దత్తావధానులరై వినుండు ! 373

ఒకనాఁడు నేను సంశయ
వికలమనస్కతఁ దరించు వెరవెఱుఁగక యూ
రికఁ బెద్ద యైన యొక నై
ష్ఠికవిప్రుని జేరి యి ట్లడిగితి వినయితన్ 374

---

* నంగాలమ్మ, కోటసత్తెమ్మలు నిడదవోలు గ్రామదేవతలు

“స్వామీ రేపు త్రయోదశిన్ జననికిన్ శ్రాద్ధక్రియం బెట్టఁగా
నీమం బున్నది, నాఁడె యేలికలు నన్ నీమించి రెండో పర
గ్రామప్రాంతపు టెన్నికల్ జరుప ; సూర్యప్రోదయాత్పూర్వమే
నే మాఱాడక పూని పోవలసియుండెన్ శ్రాద్ధ మేమైచనున్ ? 375

దొరతనపుటాజ్ఞ యెన్నిక
జరపుట యట, నిటనొ జనని శ్రాద్ధక్రియ, భూ
సురవర ! వింటి “నమాతుః
పరదైవత” మనెడి పెద్దవారల సూక్తిన్ 376

ఎటునుం దేలక యాశ్రయించితిని మి మ్మీ సంకటం బెట్లుతీ
రుట ? తామే సెలవిండు!” నాఁగ విని వాక్రుచ్చెన్ మహీదేవుఁ డం
తట “శ్రద్ధాళులుగాన మాతృతిథికర్తవ్యంబునం దింత యా
రటముం జూపితి రే పచింతు నొకమార్గం బట్ల కావింపుఁడీ ! 377

వేఁకువనె భోక్త నొక్కని
జీఁకటితోఁ బనుతు నొండు చింతింపక య
ప్డే కాళ్లు గడిగి పెట్టుం
డే కరడిం దిథిని దప్పనీఁదగ దెపుడున్ 378

శ్రమపడక, పప్పు పరమా
న్నము నొకకూరయును నొక్క నంజుఁడు తోనే
తెమలిచి వడ్డిఁపుఁడు! పయిఁ
దమరున్ ముగియించి యనుగఁ దగుఁ దమపనిపై” 379

అని ద్విజు లానతిచ్చినఁ బ్రహర్షమునొంది గృహమ్ము చేరి బ్రా
హ్మణు నుపదేశమున్ సతికి నంతయుఁదెల్పితి నామెయున్ బ్రియం
బునఁ దిథికై సమస్తమును బొందిక చేసి నిశీథ మందె మే
ల్కొనవలె వేగ నం చొరిగి కూర్కెను నేనును మేను వాల్చితిన్. 380

కలఁగంటిన్ గలలోన మత్సతి ననుం గైకట్టి "లేలెండు! మీ
రలు గ్రామాంతర మేఁగఁగావలెఁగదా రం డారగింపం డఁటం
చెలమిం గోరుచునుండె, "భోక్త మఱి రానేలేదు, మున్ముందు వా
రలు తిన్నంగద నేఁదినన్వలయు" నన్ ప్రత్యుత్తరం బిచ్చితిన్. 381

వ దానికి మదర్ధాంగి యిట్లనియె 382

"దొరక లేదఁట భోక్త, భూసురులు పంపి
రొక్క వృద్ధవిశ్వస్త నా బక్కయనద
తిని చనుచునున్న దదిగొ కన్గొనుఁ" డఁటన్న
నేను సత్వర మరిగి యా వృద్ధ వెనుక. 383

"నిలువుఁడు నిలువుఁడు! తమ యం
ఘ్రుల నొకపరి కనుల కద్దుకొననిం" డనినన్
నిలిచె పితంతువు నేఁ ద
ల్లలితపదాబ్జములఁ గన్నులకు నద్దుకొనన్. 384

అద్దుకొనుచున్న యంతలో నద్భుతముగ
వృద్ధవిశ్వస్త మిన్నంట నెదిగి పోయి
"తింటిఁ దింటిని పోవుచు నుంటి" ననుచు
భోక్తగా మాఱి మాయమై పోయెఁ గ్రుదటిని 385

తటుకునఁ గొట్టిలేపిన విధంబున మేల్కొని దిక్కుతోఁప కే
నటునిటు కంటి, వంటగదియందు మదంగన పాకసంభ్రమో
త్కటమతిఁ జేయు గిన్నియల గల్లలలున్ వినవచ్చె నిద్ర లే
పుటకయి కాంత పిల్చు పిలుపుల్ వినవచ్చె నయోమయస్థితిన్. 386

"వంట యయ్యె" ననిన భార్యమాటకు నిట్టు
లంటి నేను "వంట యగుటె కాదు-
అమ్మ వచ్చి తృప్తి నారగించుట యేఁగు
టయును నయ్యె ధన్యుఁడనె లతాంగి"! 387

అని యావత్స్వప్నచరి
త్రను దెల్పితి భార్య కామె ప్రమాన్పడి విని యెన్
వెనుకన్ నే మంచము దిగి
చనినాఁడను లౌకిక మగు శ్రాద్ధము నడపన్ 388

అవనిసురులు పంపి రప్పుడే యొకభోక్త
వచ్చి వీథి గడప వద్ద నిలిచి
"బ్రహ్మవేత్తగారి వసతి యిదే కద!"
యనుచు నడుగు చుండె నబ్బురముగ. 389

ఇంతటి యద్భుత మగు వృ
త్తాంతము నేఁ దలఁచినదియె? యమ్మ మనసు మ
చ్చింతాస్థితి నెఱుఁగుట ని
శ్చింతుఁడవై యుండు మని వచించుటొ యేమో! 390

లేదా భోక్తృస్థానము
లోఁ దాను వితంతు వట్టులు గనంబడునే!
"నేఁ దింటిఁ దింటి" నని న
న్నాదరించి పోవు నొకొ! యోచింపంగన్ 391

వ. అది యట్లుండె. శుభస్వప్నమే వచ్చినదా మేలు, చింతింపం బనిలేదు. కాక దుస్స్వప్నమే తటస్థించినఁ దదాగామి దుష్ఫలనిరాసనార్థంబు శ్రీమహాభారతేతిహాసం బొక విరుగుడు ననుశాసించినది. వినుండు! దుస్స్వప్నము కన్న యతండు లేచి తూరుపుమొగంబుగాఁ గూర్చుండి 392

"గోజాతి యెడల నా క
వ్యాజంబగు భక్తిగలదు. వందన మిడి నేఁ
బూజించెద, దుస్స్వప్న
ప్రాజద్దుష్ఫలము తొలఁగి పాఱెడుఁ గాతన్" 393

వ. అని స్మరింపవలె. 394

నావుడు బ్రహ్మవేత్త కథనంబును విన్న సదస్యు లద్భుత
ప్రావహచిత్తులై రపుడు పండిన పాఱుఁ డొకండు వల్కె "నె
న్నో విషయంబులం దెలుపుచుంటిరి మాకు, భవద్గురుత్వలీ
లావిభవంబు భాగ్యవశలబ్ధము పూర్వగవిజ్ఞకోటికిన్. 395

వ. అని యిముడుచుకొనం జాలని యావేశావేగంబున
బ్రహ్మవేత్త వంకకుం జూచి కరాంజలి నిటలతటంబున ఘటియించి
యొక్కపరి బయల్పడి యిట్లనె 396

"గురుర్బ్రహ్మ గురుర్విష్ణు
ర్గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పరంబ్రహ్మ
తస్మై శ్రీ గురవే నమః." 397

వ. అది గమనించిన బ్రహ్మవిదుం డార్ద్రచిత్తుండై యమ్ము
సలిపాఱుని వెన్ను పైఁ దట్టి స్వస్థపఱిచి యిట్లనియె. 398

చదివినాఁడ ననుచుఁ బదిచోట్ల మసలిన
వాఁడ ననుచు, మిమ్ము వీడననుచుఁ
బెద్దఁ జేసి గౌరవింతురు గాక మీ
రేను గురుడఁ గాను గాను గాను 399

నా మహిమ సున్న, నాపై
మీ మదిఁ గల యాదరణ మమేయము; ద్రోణుం
డేమంత గొప్ప? గొప్ప క
దా మఱి తా నేకలవ్యుఁ డను శిష్యుఁడహో! 400

వ. అని యొక్కింతతడవు యోచించి మఱియు నిట్లనె. 401

-: సుమతి యను శిష్యుఁడు గురువునందుఁ ద్రిమూర్తుల దర్శించుట :-

నే వినిన పురాణమ్ముల
భావింపఁగ సుమతి పేరి వాఁ డొకఁ డన్తేం
తేవాసి కలఁడు, తా గురు
దేవునిలో నజుని హరిని త్రినయనుఁ గనియెన్. 402

వ. అనిన విని యొద్దంగల మఱొకవృద్ధుండు "సుమతి యను వాఁడెవ్వండు? గురువునం దెట్లు త్రిమూర్తులను దర్శించె నా వృత్తాంతంబు సవిస్తరంబుగా నానతీయందగు" ననుచు నర్థించిన బ్రహ్మవిదుండు సభాసదుల కిట్లు చెప్పందొడంగె. 403

భవ్య మీ చరిత్ర పద్మపురాణాన
నోలిఁ గల దఁటంచు మైలవరపు
శ్రీనివాసబుధుఁడు చెప్పె సంక్షేపించి
విస్తరించి మీకు విన్నవింతు. 404

తపతీద్వీపవతీతట
విపులాశ్రమసీమ సర్వవిదుఁ డను విప్రుం
డపరబృహస్పతి శిష్యుల
కుపదేశము చేయు నున్నతోన్నతవిద్యల్. 405

అతని శ్రీపదసన్నిధి
జ్యోతిశ్శాస్త్రమ్ము నేర్చు నుత్సాహముతో
నేతెంచి సుమతి యనియెడు
నాతఁడు శిష్యుఁడయి విద్య నధ్యయనించెన్ 406

తారల్, రాశులు, లగ్నముల్, గ్రహగతుల్, స్థానంబు, లంశల్, దశల్,
హోరాకాలము, రాహుకాలము, గడుల్, యోగంబు, గండంబు, గో
చారంబుల్, ఫలితంబు లాదిగ సమస్తజ్యోతిషాంగమ్ములుం
బారాడున్ సత మక్కుమారుని మనోవశ్యంబులై నిద్రనేన్. 407

గురువుల్ చెప్పిన యొక్క లక్షణము నిగ్గుందేల్వగాఁ బెక్కుటన్
బరిశీలించును లక్ష్యముల్ నడచుచో, భక్షించుచోఁ దాఁగుచో
నొరుగఁ బోయెడిచో-సమస్త సమయోద్యోగంబులన్ జ్యోతిష
స్ఫురణైకాగ్రతఁ దప్ప దాశని మనస్స్వచ్ఛప్రతాపం బెటన్. 408

ఇట్టు లుండ నొక్క యేణ మాశ్రమకుటీ
నీనమోసి వెత వహించి యుండె-
సుమతి దవుల నిల్చి గమనించుచుండె శీ
ర్షోదయక్షణంబు నుత్సుకమతి. 409

ప్రసవించె హరిణి, యాతఁడు
ప్రసరించెన్ దృష్టి వెంట గ్రహబలము పయిన్,
నిసువున కొక మాసమ్మున
కిసి ! మాతృవియోగగండ మెడపక తోఁచెన్. 410

వినిచెఁ దదాత్మదర్శితము వీరికి వారికి, వారొ హొమ్మహొ
మ్మనిరి, భవిష్యదర్థము యథార్థ మెఱింగిన దేశికుం డెఱుం
గని యటువోలెఁ "జూచెదముగా నెల దిర్గకపోవునా మృగి
జనని గతించుటో సుఖదశన్ బెనుపొందుటొ తేలదా" యనెన్. 411

పిమ్మట సుమతి వచస్స్విత
వ మ్మొనరిచి సంతసించు వా రిఱ్ఱిని భ
ద్రమ్ముగఁ గాచుచు నడవులఁ
గ్రుమ్మరఁగా నీక మేపుకొనుచుం ద్రింటన్. 412

క్రొన్ననలఁ జివురుటాకుల
సన్ననిగఱికలను నడవిజాజులఁ జవికిన్
జున్నగు దర్భాంకురములఁ
దిన్నది పుష్టి యని తెచ్చి తినిపింత్రు మృగిన్. 413

కాలు కదపకుండ కామితాహారంబు
లవియె వచ్చి నోటి కందుచుండ
విట్టవీఁగె నిట్టి పెద్దింటి సుతుఁ బోలె
భోగి వోలెఁ గపటయోగి వోలె. 414

కొలఁదిదినంబు లిట్లు చనెఁ గొండొకనాఁడు తదేణమాతకున్
నలఁత యొకింత కానఁబడె నాఁటికినాఁటి కజీర్తిఁ బాసనం
బుల కదిదింపెఁ దిండిచెడి మోరను వ్రేలఁగవైచి నిల్వుచూ
పులు పడి యస్పృహందవిలి పోయెఁ గురంగము మాసపూర్తికిన్.

సుమతి యనన్యసాధ్యమతిసూక్ష్మత కెంతయు మెచ్చి వచ్చి యా
శ్రమజను లొక్కరొక్కరు నిజప్రజజాతకరీతి వ్రాసి పె
ట్టుమనుచుఁ గోరుచుంట, యతఁడున్గురుసమ్మతి వ్రాసి యాఁగ్రమ
క్రమముగ శాస్త్రదేవతకు రచ్చయుఁ దీర్థము నయ్యె వాని యల్.

అందటి జాతకమ్ములు కరామలకమ్ములు నయ్యెఁగాని సద్
బృందసమర్చితాంఘ్రి యగు దేశికదేవుని జాతకక్రమం
బెందు నగమ్యమై సుమతిహృద్గతి నేఁచు, గురుండు జన్మవే
ళం దెలుపండు, తా నడుగ లావరికాఁడటు శిష్యుఁడౌటచే. 417

కడచె నిట్లు కొంతకాల, మున్నట్టుండి
యొజ్జ షష్టిపూర్తి యుత్సవమ్ము
సంఘటిల్లెఁ దెలిసె ఛాత్రుం డుపాధ్యాయు
జనన తిథియు గడియ మనసు మురియ. 418

ఇఁక గుణియించె రేఁబవ లదేపని నన్యము ప్రక్కఁబెట్టి, తే
ల్చుకొలఁది స్వామిజీవితములో నిఁకఁ బక్షము దాఁటినన్ మహా
వికృతనికృష్టకష్టము ప్రవేశము సేయఁగ నుండె, గుండియల్
శకలము లయ్యె శిష్యునకు సద్గురు భావివిపద్దశాస్పృహన్. 419

పిమ్మటఁ గొంతతేఱి గురువేశ్మము సొచ్చె, గురుండు ప్రీతిపూ
ర్వమ్ముగ మన్మలన్ మనుమరాండ్రను దగ్గరఁదీసి హాస్యవా
క్యమ్ములఁ బొద్దుపుచ్చుచు, నిజాంగన పెట్టిన కజ్జకాయలన్
గమ్మని పప్పులం దినుచుఁ గన్పడె నిశ్చల సుప్రసన్నతన్. 420

వ. అప్పు డశ్రుకణముఖుం డగు శిష్యగణప్రముఖుండు గురుదేవున కిట్లనియె. 421

ఓ పరమాత్మ! తా మెఱుఁగ కుండిన దొసఁగును లేదు, పక్షపుం
దాపుల మీ శరీరమును దారుణరుగ్మత యాక్రమించు నే
రూపమునన్ భరించెదరు రోయక? త్రోయక నాదువిన్నపం
బాపద దాఁటి నన్నుఁ జరితార్థుని జేయుఁడి! యంజలించెదన్. 422

ఏతద్వ్యాధిని నేను గైకొనెదఁ దండ్రీ! యిందు సిద్ధుండఁ బ్ర
ఖ్యాతంబైన పరప్రదాన మను విద్యాశక్తి కీ శిష్యుఁడౌఁ
గాతన్‌లక్ష్యము, మీకు క్షేమమును నాకా కీర్తి చేకూఱుఁగా
జాతారార్కము శిష్యవత్సల! త్రికాలాభిజ్ఞ! విద్యాప్రదా! 423

కావలె నంచు నే నడిగి కైకొనుచుంటి భవద్రుజన్ గృపా
సేవధి! కానఁ బాపము స్పృశింపదు మిమ్ము దెకాక యాచకే
చ్ఛావరదానపుణ్యమును సంభవమౌ నిఁక సంశయింపఁగాఁ
బోవకుఁ డర్థినై గురుల ముందర నిల్చితిఁ జేయి చాపితిన్. 424

వ. అని శిష్యప్రముఖుండు పూర్వాభిముఖుండై వార్చి, ప్రణవోచ్చరణపూర్వకంబుగా నపఉపస్పర్శఁ గావించి, దర్భాంగుళీయకంబు సవదరించి, రుజాపరిగ్రహణ సిద్ధుండై నిలిచిన, 425

జలజల రాలు నశ్రుకణజాలము నాఁపికొనంగలేక తొ
ట్రిలుచు గురుండు పల్కె నిటు "రే! ప్రియశిష్య! తెగించి యెంతకుం
దలపడి వచ్చినాఁడవు ! మదర్థము నిష్ఠురకుష్ఠరోగమున్
వలచి భరింతువా ? తగు శుభంబని దానికి సమ్మతింపనా ? 426

క్రూరుఁడఁగాను నాదు తనురోగము నీ తనువందుఁ బెట్టి నే
నూరటనొంద యజ్ఞనకృతోదితకర్మఫలంబు తీపియో
కారమొ జజ్ఞనుండె తినఁగావలె జ్ఞానము నట్లు రోగముం
గోరుట చెల్లునే గురుని ? కోరిన నిచ్చునె యెట్టి యొజ్ఞయున్. 427

గురు లిట్లానతియిచ్చినం దిరిగి వాకోనేర కా శిష్యశే
ఖరుఁ డొక్కించుక తాళి వెండియునె "శ్రీకాశీపురావాస మె
వ్వరికేన్ బున్నెము రెట్టిసేయు నని చెప్పన్ విందు మందేగి కా
పురమున్నన్ దమ వ్యాధికాల మరకుం బోఁ దగ్గుఁ బుణ్యోన్నతిన్.

దేశికదేవ ! వే బయలుదేరుఁడు ! నేనును వెంటవత్తు, వి
శ్వేశపదాబ్జసన్నిధి వసింపుఁడు తాము ! భవత్పదాబ్జసే
వాశుభకార్యమగ్నమతిఁ బాయక నేను వసించి, మీకు నే
లేశము కాశికానగరి క్లేశము గల్గకయుండఁ గాచెదన్". 429

ఆ మనవిన్ గురుండు విని "యౌనవు, వీఁడు వచించు సూత్రమున్
క్షేమమె, రెండు వర్షముల శిక్షను నే నొక వర్షమందె యె
ట్లో ముగియించుకొందు ద్విగుణోన్నతపుణ్యఫలమ్ము కాశికా
గ్రామనివాస మట్లొనఁగుఁ గావున" నంచుఁ దలంచి వేర్పెడిన్. 430

వ. ముహూర్తంబు నిర్ణయించుకొని సర్వవిదుండు సుమతి
సమేతుండై దుర్గంబగు మార్గంబునందు, సహనంబు వలన గహనం
బుల, కలంబులవలన జలంబుల, బిడారులవలన నెడారుల, దిట్టల

వలన గుట్టల, కొయ్యల వలన లోయల దాటి దాటి రాత్రింబుల
సత్రంబుల శయనించి, పవలు త్రోవలు నడచి యెట్టకేలకుఁ గాశీ
పట్టణంబు చేరె. అట్లు చేరిన గురుశిష్యులు, 431

హట్టంబునఁ గల యొక గృహ
కుట్టిమమునఁ గొంతతడవు కూర్చుండి, సుఖం
బుట్టిపడన్ మణికర్ణిక
ఘట్టంబున స్నానమాడి కదలిరి గుడికిన్ 432

గుడి యావరణమ్మున నడు
గిడి నంతనె సర్వవిదుని హృదయ మ్మొక్కు
మ్మడి ఝల్లు మనియె నొడ లె
ల్లెడల గగుర్పొడిచె నభవు ని ట్లర్థించెన్ 433

"శ్రీవిశ్వేశ్వర దేవదేవ కరుణాసింధూ భవా పార్వతీ
శా వారాణసివాస భక్తసులభా శంభూ శివా శంకరా !
నీవే దిక్కని వచ్చి వ్రాలితిని తండ్రీ ! దుర్భరవ్యాధి పీ
డావైక్లబ్యము మాన్పి యెట్లొ దరికీడ్వన్ నిన్నె ప్రార్థించెదన్. 434

సకలజ్ఞుండవు మత్పురాకృతభవిష్యమ్ముల్ భవద్దివ్యదృ
ష్టికి లోనై చరియించు, యాచకుఁడనై శ్రీతావకాంఘ్రిద్వయీ
ప్రకటారాధనభాగ్యభిక్షకొఱకై ప్రార్థించుచున్నాఁడ, మా
మకకర్మస్థితిఁ ద్రిప్పి, కష్టదశ సాంతా ! మాపి కాపాడవే !" 435

అటు లర్థించి గురుండు
తృ్కటభక్తిన్ సమయసముచితం బగు పూజన్
ఘటియించి మరలి, యా చెం
గటి యొక సత్రమును వసతిగాఁ గొని యుండెన్. 436

గురుదేవులను గాంగఝరి స్నాన మాడించి
పట్టువస్త్రమ్ములు కట్టఁ బెట్టి
అగ్నికార్యమునకై యఖిలంబు సమకూర్చి
విశ్వేశు పూజలో వెంట నుండి
వంట వార్పులు శాకపాకమ్ము లమరించి
తిని త్రేన్చు వఱకు వడ్డనలు చేసి
గురుభుక్తశేషంబు పరమభక్తి భుజించి
వంట యిల్లలికి శుభ్ర మ్మొనర్చి

స్వామి నడుము వ్రాల్పఁగా నుంచమును వైచి
బట్ట లుతికి యారఁబెట్టి వచ్చి
చరణసేవ శాస్త్రచర్చలు సాగించి
యుపచరించు చుండె నెపుడు సుమతి 437

ఒక దినము సుమతి శ్రీదే
శికు పాదము లొత్తి సేవ చేయుచు నుండన్
వికటించి యఱచె భట్టా
రకుఁ డోరీ చంపినావురా, యని కల్కన్. 438

తత్తరపడి శిష్యసత్తముఁ డా గురు
స్వామి మోముఁ జూడ జంకి జంకి
"నను క్షమింపుఁ" డనియె. వినియు విననియట్లె
మండిపడియె మరలఁ బండితుండు. 439

ఒత్తుటె కాని వ్రే ళ్లొరసియుండిన పుండును జూచుకొంటయే
బొత్తిగ లేద టంధుఁడవొ మూర్ఖుఁడవో కనుమిన్నుగాన వీ
తొత్తుటికమ్ము నా యుసురు తోడుచునున్నది యింతకంటె నా
కుత్తుక నొక్క వ్రేటు నిడి కోయుము పీడ తొలంగి పోయెడున్"

ఆ పై "ముల్కులు" దూరకుండ శతరంధ్రాచ్ఛాదనం జేసికొం
చా పిల్లం డిటు పల్కె నమ్రమతి "దేవా! చూచికోలేదు నా
లోపంబే, యిఁకమీఁద భద్రవిధిఁ గొల్తున్ మీకు నేబాధ నే
రూపానన్ ఘటియింప" నా గురుఁ డధూర్తుం డయ్యె నాపూఁటకున్

దినములు దొర్లుచుండె గురుదేహ మసహ్యరుజాప్రభావిత
వ్రణపరిదాహదుర్దశ భరం బయి క్రుళ్లి రసుల్ స్రవించి, కం
పునెనసి, మూసి వ్రేళ్లకణుపుల్ తెగి, పై కెగఁబ్రాఁకి పుండ్లుదే
రిన దవుదవ్వులం దొలఁగి త్రిమ్మరఁ జొచ్చిరి సత్రమిత్రముల్.

గురువుగారు కదలఁ గోరిన వెన్నిచ్చి
తినఁ దలంపఁ దోసిటిని నొసంగి
పవ్వళింపఁ బక్క ప్రక్కనె చోటిచ్చి
సేవ చేయుచుండె శిష్యభటుఁడు. 443

కడుపు చల్లఁబడినఁ గబురులు చెప్పును
పుండు రేఁగెనేని మండిపడును;
ఎప్పు డేమి యనునొ యెట్లు వర్తించునో
తెలియ కుండె గురుని తీరు తెన్ను. 444

అడిగినదాని కేదొ బదులాడినఁ "దిర్గి జవాబు చెప్పఁ జూ
చెడు మగవాఁడవైతి విఁక శిష్యుఁడ నేను, గురుండ వీ" వనున్,
అడిగినదాని కింత బదులాడక నిల్చిన "లెక్కలేదు, మా
యెడ నొక గౌరవ మ్మనుచు నేడ్చినదా !" యని తిట్టిపోసెడున్.

మట్టమధ్యాహ్న మొకనాఁడు తిట్టుచుండెఁ
బంతు లా శిష్యు నోటికి వచ్చి నట్లు –
"ఏమిరా మాకుఁ బూజారు లిచ్చు చున్న
యుపదలను నీవె దిగమ్రింగు చుంటి వఁట ! 446

ఏదో లోపల కక్ష దాఁచికొని న న్నెట్లని సాధింపఁగాఁ
జేదో డం చొక వంకఁబెట్టికొని కాశీయాత్రఁ గల్పించితీ
వో దౌర్భాగ్యుఁడ ! కాక యింటికడనే యున్నం గళత్రాత్మపు
త్రాదుల్ పూవుల లోనఁ బెట్టికొని మ మ్మర్చించి పూజింపరే ! 447

ఛీ దరిద్రుఁడ ! ముఖము చూచినదె పాప
మింక విడువుము ! విడువవు బంకవోలె
ననుచుఁ దిట్టును గొట్టును నఱచుఁ గరచుఁ
బంచె దిగలాగుఁ బయి కేకరించి యుమియు. 448

వ. అప్పుడు సుమతి యంతర్గతంబున 449

స్వామి తప్పు లేదు, సంవత్సరద్వయం
బనుభవింపఁ దగిన వ్యథ యదెల్ల
నొక్క యేఁట నిజికి యుండవలసి వచ్చి
ద్విగుణ మయ్యె రోగతీవ్రత యిటు. 450

అని భావించి యథాక్రమంబు గురుసేవాయత్తుఁడై యెజ్జ కొ
ట్టిన ఛీకొట్టిన సైఁచుచుండెఁ జనుచుండెం గాల మిట్లే దినం
బును నేదో యొకరీతి భాగవతమైపోయెన్ బ్రజల్ శిష్యవ
ర్తన మధ్యాపక దౌష్ట్యముం గుఱిచి గాథల్ చెప్పికో నప్పరిన్. 451

అది యమావాస్య, నాఁటి సాయంతనమ్ము
పొయ్యి పై బియ్యమును బెట్టి పొట్లకాయఁ
దరుగుచుండెను శిష్యుఁడు గురున కేమి
వచ్చెనో లేచి యా పొయ్యి వద్ద కేఁగి 452

భగభగ మండు కట్టియలఁ బట్టి యదాటున బిడ్డవీఁపుపైఁ
దగిలిచి కాల్చి డిగ్గనిమదంబున శిష్యశిరమ్ము వంచి ముం
దుగఁ గల కత్తిపీటపయిఁ ద్రోసి లలాటము చీరి రొప్పుచున్
రగులుచు నేఁగి సెజ్జపయి వ్రాలెఁ బగన్ దెగటార్చుకొన్న టుల్. 453

సుమతి లేచి గురుని విమలాంఘ్రిసన్నిధా
నమునఁ జేరి "యెంత శ్రమపడితిరి !
పవ్వళింపుఁ డనుచుఁ బాదమ్ము లొత్తి సే
వింపసాగె నిద్దురింప గురుఁడు. 454

వీఁపు బొబ్బలెక్కి విచ్చిన లాలాట
తలము నుండి రక్తధార లొలుక
కూరుచుండి సుమతి కును కెఱుంగక యట్లె
నెరపుచుండె గురుల చరణసేవ 455

ఒక నిశివేళ మూసికొనియుండిన శిష్యుని రెప్పలం జక
చ్చకితము నైన వెల్గొకటి చక్కనిముద్దగఁ దోఁచి, వే త్రిధా
శకలితమై క్రమక్రమ లసత్పరిణద్దము నొచు నాకృతుల్
ప్రకటిత మైన వారె కనుపట్టిరి బ్రహ్మయు విష్ణు వీశుఁడున్ 456

ఆ ముమ్మూర్తు లొకేయెలుంగునఁ "గుమారా! లెమ్ము! త్వద్దేశిక
స్వామి శ్రీచరణార్చనానిశితదీక్షాదృష్టికిన్ మెచ్చి సం
ప్రేమన్ నిన్ను ననుగ్రహించుటకు మేమే వచ్చియున్నాము: కా
నీ మా వాంఛితమెందు తీర్పవలె నోయీ నీవు మున్మందుగన్".

వ. అనిరి, అట్లు నియమించు బ్రహ్మ విష్ణు మహేశ్వరులకుఁ
బ్రత్యుత్తరం బీయఁజాలక శిష్యుఁ డూరక కూర్చుండిన వెండియుఁ
ద్రిమూర్తు లిట్లనిరి. 458

"మా కాహారము సాధుసజ్జననమోమాత్రార్చనల్, దానికి
స్సీ! కర్వైనది నేఁటికాలమున, దుశ్చింతుల్ దురాత్ముల్ దురా
శాకాలుష్యమనస్కు లిచ్చెడి నమస్కారమ్ములా యిఁపుగా
వో కుక్షా! యిడుమీ నమస్కృతియొకం డుద్ధూతమౌ మాక్షుధల్.

నీ యొక్క నమస్కారము
మా యాఁకలిఁదీర్చుఁ దృప్తమతి మేమిడు దీ
ర్ఘాయుశ్శుభసంపద ల
బ్బా యీ! ప్రాణులకుఁ బరమవరములు గావే ?" 460

వ. వారి వచనములకు సుమతి హర్షించి యిట్లనియె. "మహానుభావులారా! ధన్యుఁడను. మీ పలికిన యుత్తరార్థంబు యథార్థంబ. ఇఁక నా నమస్కారవిషయ మందురా యవధరింపుఁడు! 461

గురువె బ్రహ్మ నాకు, గురువె విష్ణువు నాకు
గురువె యీశ్వరుండు, గురువె వేల్పు-
మఱి యటౌట నా నమస్కృతి గురునకే.
పెట్ట నేర మీకు విబుధులార! 462

"గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః
గురుర్దేవో మహేశ్వరః
గురు స్సాక్షాత్పరం బ్రహ్మ
తస్మై శ్రీ గురవే నమః". 463

ఆతని గాఢనిశ్చయము నాతని దేశికభక్తియున్ మనః
ప్రీతి ఘటింప మెచ్చుకొని వెంటనె వేల్పులు "వత్స! కోరుకో
మ్మాతతరక్తి నెట్టి వరమైనను నిచ్చెద" మన్న శిష్యుఁ డీ
రీతిని విన్నవించెను విరించికి శ్రీహరికిన్ గపర్దికిన్. 464

"స్వస్థతఁ దక్కియున్న గురుసత్తము లిప్పుడకాంతుల్గాక పూ
ర్వస్థితి" నాఁగబ్రహ్మవిని "వత్స! భవద్గురుదేవు నట్లె పూ
ర్వస్థితి నీవు గూడఁ గనువాఁడవు కొ''మ్మనె దేవతాదయా
ద్రస్థిరదృష్టి నిర్వురను గ్రక్కునఁ గాంచిరి స్వస్థదేహముల్. 465

వ. మఱియు ద్రిమూర్తుల యనుగ్రహంబున నగ్గురుశిష్యు లాక్షణంబ కాశీపట్టణంబు విడచి స్వస్థలంబు చేరి సుఖంబుండిరి. 466

ఈ సుమతిచరిత నంతే
వాసి యెవండు వినుఁ జదువు వాఁ డిల విద్యా
భ్యాసావసరమ్మున మే
ధాసంపద విస్తరిల్లి ధన్యాత్ముఁ డగున్. 467

వ అని యిట్లు ఫలశ్రుత్యంతంబుగాఁ గథ ముగించిన బ్రహ్మవేత్తతో నొక్క పద్మసాలె గృహస్థుండు 468

"బాగున్నది యీ కథ, యివు
డే గృహమున కేఁగి వెంటనే విన్పింతున్
మా గడుసుఁగాయలకు; బడి
కేఁగుచు నున్నారు తెలువు లెదుగును వినినన్". 469

అని లేచె, నెల్ల రా దిన
మునకుం జాలించి తీర్థముఁ బ్రసాదంబుల్
గొన లోని కరుగఁ బూజరి
విని పించెను వారి కొక్క విశ్రుతవార్తన్. 470

వ. ఉే పుగాది పండువు గదా! మన గ్రామమ్మునఁ గూడ వేడుకలు! 471

కవు లెల్లరు చేరుదు రఁట,
కవితలు విన్పింతురంట, కరపత్రము లి
చ్చి వెడలి రివిగో ! తమ కే
యవకాశం బున్న నరుగఁ డక్కవి సభకున్". 472

వ. అని అర్చకుండు తీర్థప్రసాదంబు లిచ్చి కరపత్రంబు లందిచ్చె. 473

— 0 —

శ్రీ గాడేపల్లి మల్లికార్జున సుబ్బాంబా కుమార కుక్కుటేశ్వర
ప్రణీతం బయిన ఆనందవల్లి లోని చతుర్థాశ్వాసము ముగిసినది.

ఆ మఱునాఁ డెప్పటి వలె
గ్రామస్థులు, బ్రహ్మవేత్త, రామాలయ తత్
శ్రీమండపమ్ముఁ జేరిరి
గ్రామస్థుం డొక్కఁడనియె బ్రహ్మవిదునితో. 474

ఈ యుదయంబునం దటు కవీంద్రులఁ జూడఁగ నేఁగితిన్ సుధా
ప్రాయములైన గేయములఁ బద్యములన్ వచనంబులన్ గవుల్
హాయిగఁ బ్రస్తుతించిరి యుగాది నుగాదిని గోకిలారుతి
శ్రీయుతవాసరాస్యలహరీకృతగంధవహాభినందనన్. 475

-: ఒక యువకవి విత్తే ముందని కవిత్వము చెప్పుట :-

వ. ఆ కవులలో 476

నరసింహశర్మ యఁట, తా
విరచించిన పద్యములు విన్పించుచు సృ
ష్టిరహస్యంబున విత్తే
యరయంగా మొదలు వృక్ష మనరా దనియెన్. 477

అప్పుడు వచ్చె సంశయము హా! తొలినాఁటి భవత్ప్రసంగ మం
దప్పరమేష్ఠి వృక్షనిచయాదులఁ దొల్త సృజించి తిండికై
యప్పన చేసె జీవులకటంచు వచించితి రిప్పు డీతఁడో
యిప్పగిదిన్ వచించె నెది యింతకు సత్యమటంచు నమ్మఁటల్. 478

అని గ్రామస్థుం డడిగిన
విని యాచార్యుండు మిగుల విభ్రమపడి "యే
మనె? విత్తె మొదటి దనియెన?
ఘనుఁ డా కవి యెట్లు దానిఁ గల్పన చేసెన్? 479

విత్తె మొదలింటి దనఁ గవిసత్తముండు
చూపియుండిన యుపపత్తి యే పగిదిదొ
చెప్పు వింద మఁటన్నఁ దాఁ జెప్పఁదొడఁగెఁ
గవిసభకు నేఁగి వచ్చిన గ్రామసఖుఁడు. 480

"మిడమి బురద ముద్ద వడువునఁ బడియుండె
గ్రుడ్డి గ్రుడ్డి వెలుతురులు రహించెఁ
బేడ పుర్వు లట్టు లేడ నుండియొ పుట్టి
రాలు మగలు నైన యాది నరులు. 481

ఆవురావు రనుచు నాఁకటి పెల్లుచేఁ
దల్లడిలుచుఁ బొరలు దంపతులను
బుడమి తల్లి కరుణ పొడమిన దృక్కుల
నాదరించి తినఁ దఁటం చొసంగ, 482

మట్టి ముద్ద యొకటి మామిటి పండాయె
నొకటి నారికేళ మొకటి యరఁటి
యొక్క టేమి? యిచ్చు చుండిన యా మట్టి
ముద్ద లెల్లఁ బండ్ల పొలుపు దాల్చె. 483

జఠరాగ్ని ప్రకృతులు క
ర్మఠులగు నమ్మిథునమునకుఁ గ్రమశః క్రమశః
కఠినక్షుద్దంష్ట్రలు
మఠభిక్షువు లట్లు కోట్లమంది జనింపన్. 484

జడిసి పుడమి నుడివె జనసంతతిని బిల్చి
"మట్టిఁ బండ్లు గాఁగ మలచి మలచి
చేతు లెల్ల నొక్కఁడే తీపులై పోయెఁ
బోవుచుంటి గర్భభూస్థలికిని" 485

అనిన నాఁగుమాఁగు మనుచు నన్నార్తులు
పుడమితల్లి నిట్టు లడిగి రపుడు–
"ఏమి చేసి పోదువే మమ్ము మాక్షుత్తుఁ?
దిండి లేక చచ్చు టొండె గతియొ!" 486

అంత ధాత్రి యనియె "నార్తులౌ మిమ్ముల
వదలి చనుట నాకు బాధయె మఱి
యేమి చేయ నేర్తు నేఁగక తప్పదు
చనను దూర మిక్కడనె వసింతు. 487

దుమ్ము పొరల క్రింద దూరియుండెద, మీకు
నే ఫలంబుఁ దినుట కిచ్చ యగునొ
యా ఫలంబుఁ దెచ్చి యవని నించుక త్రవ్వి
కప్పిపెట్టుఁ డెఱుఁగఁ గలను గోర్కి. 488

ఆ ఫలమ్మునుండి యావిర్భవించును
మొలక, యదియె వృక్షముగఁ దనర్చు
నది యొసంగు మీకు నా ఫలంబులు గంపెఁ
డవి భుజించి బ్రతుకుఁ డన్నలార!" 489

ఇట్లు చెప్పి తల్లి యెటొ మాయమై పోయె
విత్త నేర్చె జనము, విత్తు మొదలొ
చెట్టు మొదలొ యన్న చిరకాలపుం బ్రశ్న
మునకు విత్తె మొదలి దనుచుఁ దేలె. 490

అని కవిసమ్మేళనసభ
విని వచ్చిన కథను గ్రామవృద్ధుం డటు తె
ల్పి, నిజం చేదో సెల విం
డని కోరిన బ్రహ్మవేత్త యనె శ్రోతలతో. 491

అది సత్య మిది కవిత్వం
బది చెప్పిన సుకృతి వ్యాసుఁ డఖిలజ్ఞుం, డ
య్యది విశ్వసింపవలె; ని
య్యది యద్భుతకల్పన యని హర్షింపఁ దగున్. 492

వ. అని యమ్మహానుభావుండు తెల్పిన విని, సభ్యులు తత్తాదృక్సృష్టినిర్మాణంబు విషయంబుగాఁ గొండొక చర్చావినోదంబునకుం జొచ్చి ముచ్చటించుకొనుచుండ నచ్చటకుఁ బార్వప్రస్తావితుండైన బ్రహ్మవేత్త మేనల్లుండు వచ్చె. వచ్చిన మిత్రులకు బ్రహ్మవిదుఁ డతనిం జూపి యిట్లనె. 493

వీఁడే మా మేనల్లుఁడు
నాఁ డర్చకవృత్తి దూరినాఁ డంటిఁ గదా!
వాఁడే యీఁతడు నన్నుం
జూడంగా వచ్చె మిమ్ముఁ జూడఁగ వచ్చెన్. 494

-: బ్రహ్మవేత్త మేనల్లుని యర్చకజీవితము :-

అను చాచార్యుఁడు తెల్ప నల్లుని బ్రియంబారం బ్రశంసించి యి
ట్లని రా పెద్దలు "నీకు సేమమె కదన్నా ? నీవు సేవించు దే
వుని కర్చావిధి సాగుచున్నదె కదా! పుణ్యుండ వాచార్యజీ
వన మియ్యర్చకజీవనంబులనఁ బ్రాక్ప్రాక్పుణ్యసంపాద్యముల్.

"ఏ లాగున గడియించితి
వీ లలితార్చకత చెప్పుమీ" యన నల్లుం
డీ లీలఁదెల్పెఁ బున్నెము
జోలి యెఱుఁగ మత్ప్రయత్నశుద్ధి లభించెన్". 496

వ. అని మఱియు నిట్లనియె 497

"దేవాలయాధికారులు
దేవాలయ ముఖ్యనిర్మితిశ్రమలు ననున్
రావించి మౌఖికపరీ
క్షావిధి జరిపించి యర్చకత నిచ్చి రటుల్." 498

దానికి సుంత నవ్వుకొని తత్సభనున్న గృహస్థుఁ డొక్కఁ డ
వ్వానిని మేనయల్లు నొగిఁ బ్రశ్నమొనర్చెను "దీనికిం బరీ
క్షానియమం బొకండ? సరి, సమ్మతి వారెటు పృచ్ఛచేసి ర
వ్వానికి నీ వొసంగిన జవాబు లవేమి? వినంగఁ దెల్పుమీ!" 499

వ. అని యడిగిన వారి కయ్యర్చకయువకుం డిట్లు చెప్పం
దొడంగె 500

-: పది ప్రశ్నములు, పది సమాధానములు :-

క్షోణి నెల్లరికంటె సుఖశాలి యెవ్వఁడు?
వోల నెల్లరికంటె మూర్ఖుఁ డెవ్వఁ
డన్నింటి కంటె నెయ్యది పెద్ద? యన్నింటి
కంటెను సుళువైన కార్యమేది?
బలువింతయౌ మానవప్రవృత్తి యదెట్టి?
దెద్దాన విద్యార్థి మెద్దువారు?
తెలిసి మనుష్యుఁ డేది యొనర్చు? తెలియకుం
డ మనుష్యుఁ డేది యొనర్చుచుండు?

నన్ని దానముల మహాదాన మెయ్యది ?
వాస్తవమున కధికబలుఁ డెవండు ?
ననుచుఁ బ్రశ్నములను నడిగిరి పది వాని
కెల్ల నుత్తరంబు లిచ్చితి నిటు 501

క్షోణి నెల్లరికంటె సుఖి తృప్తి కలవాఁడు
పరమతవిద్వేషి పరమమూర్ఖుఁ
డన్నింటికంటె నహంకార మది పెద్ద
యన్యుల నిందించు టన్న సుళువు
తన వర్తనమె మంచిదని మెలంగుట వింత
శ్రద్ధలేమి వటుండు మొద్దువారు
తెలిసి మోహాన బంధితుఁడౌను, తెలియకుం
థ నరుండు మిత్తికి డగ్గ ఱగును

అద నెఱింగి చేసినదె మహాదానమౌ
నప్పు లేని వాఁడె యధికబలుఁడు
ననుచు వారి పృచ్ఛ లన్నింటికిఁ గ్రమాన
నుత్తరంబు లిచ్చియుంటి నెంచి. 502

వ. అది విని యర్చకకుమారు మేధావై లక్షణ్యంబునకు సభ్యు
లబ్బురపడిరి. వారిలోని యొక్క కృషీవలస్థవిరుండు, 503

"నా దొక ప్రశ్నము, నరులకు
శ్రీదేవతలకును నే విశిష్టాన్యోన్యా
సాదితబంధము చిరకా
లాది ప్రవర్తిల్లు ? తెల్పు మని యడుగుటయున్. 504

వ. అయ్యర్చకయువ యిట్లనియె. 505

"మానవులు వేలుపులకు నమస్కరింత్రు
వేలుపులు మానవులను దీవించి మంత్రు
భువిని గల నీర మిగిరి యద్దివికిఁ బ్రాఁకు
దివిఁ గురియు వర్షధారలు భువికి దూఁకు". 506

హర్షించి దాని క య్యర్చకయువకుఁ
గర్షకస్థవిరుఁ డిగ్గతి వెండి యడిగె. 507

"ఏవో తప్పులు పాపముల్ సలిపి సర్వేశున్ సమర్చించు ని
చ్ఛావృత్తిన్ గుడి కేఁగు చుంద్రు ప్రజ, పూజార్లర్థిఁ దీర్థంబులన్
నై వేద్యంబుల నిచ్చి పంపుదురు, దానన్ దోసముల్ వాయునే!
దేవుం డట్లె క్షమించి వారలకు ముక్తింగూర్చి రక్షించునే?" 508

నావుడు పూజారి ట్లనె
"దేవుఁడు పిత, యాశ్రయించు దీనుఁడు పుత్త్రుం
డే వేళను పిత పుత్త్రునిఁ
గావఁడె క్షమియించి, డాయఁ గాదనునె సుతున్? 509

వ. ఇట్టి యర్థంబు క్రైస్తవవేదంబునం గల యొక్క ప్రశస్త సంవాదంబునం దెల్పంబడియె వినుం డని మేనల్లుండు శ్రోతల కిట్లు చెప్పందొడంగె. 510

-: తప్పిపోయిన కుమారుని కథ :-

పూర్వము పూణ్యభూమి నొక ప్రోల వసించె గృహస్థుఁ డొక్కరుం
డుర్విని నమ్ముకొన్న హలికోత్తముఁ డిండ్లును వాకిళుల్ మడుల్
చెర్వులు చెట్లుచేమలు విశిష్టధనంబులు పాడిపంటయున్
బర్వప్రతిష్ఠయుం గలిగి వర్ధిలె నర్థిమనః ప్రమోదియై. 511

గృహిణి గృహభార మఱుత వహించి మోయ
సుతులు తమ తమ కార్యపద్ధతిఁ జరింప,
సేద్యవృత్తులు నవరింప జీతగాండ్రు
చక్క సాగించె సంసార మక్కుటుంబి 512

ఒక రాత్రి భర్త కన్నా
దికము నడిపి గృహిణి తత్పతింగని ప్రియపూ
ర్వకభాషణముల నిట్లనెఁ
బ్రకటించుచుఁ జిన్న కొడుకు భావపథంబున్. 515

"విన్నారా మనచిన్ని వేఱుపడ భావించెన్, సుతుం డప్పు డ
ప్డ న్నా చెంతకువచ్చి పైతృక ధనంబుం బంచి యిప్పించుమం
చెన్నోరీతులఁ బోరు నా ధనముఁతో నే దూరదేశాన నే
తెన్నుందొ్రక్కియొ సల్పి వర్తకము వృద్ధింబొంద వాంఛించెడున్.

కానిం డింతకు వానివృద్ధియెకదా కాంక్షింతు మీ నాఁడు కా
దే నేనాఁటికి నైన వాని సగపా లీకుందురే పంచి!" యం
చా నారీమణి విన్నవించిన విభుం "డౌఁగాక! యోచింత మో
నీఁనిద్రింపుము పొ్రద్దుపోయె" నని పంచెన్ దానుఁగూర్కొందగన్.

ప్రొద్దు పొడిచె, సుతుల నిద్దరఁ బిల్పించి
నుడివెఁ దండ్రి చిన్న కొడుకు తోడ-
"అమ్మ చెప్పె నీ తదర్థమ్ము భాగించి
యిచ్చువాఁడఁ గొనుము యెల్లి నేఁట. 516

మము విడిచి నీవు దూరదేశముల కరుగఁ
దలఁచి తను వార్త నన్నెంతొ కలఁచు చున్న
దైనఁ గాదన నీ వృద్ధి కడ్డపడను
హృదయమున మమ్ము మఱవకుండుదు గదయ్య!" 517

అని పాల్పించె గృహస్థుఁడు
తన కటు పొత్తిచ్చితీంచినట్టి ధనరాశులతోఁ
జినకొడుకు కిలు విడిచెను, తం
డ్రిని గనిపెట్టుకొని యన్న గృహమున నిలిచెన్. 518

ఆ చినవాఁడు దర్వ్యసనముదంచితుఁడై యటు దేశదేశముల్
చూచుచు నందునందుఁ గల చోద్యములం గనుఁగొంచు, బుద్ధికిం
దోఁచిన భోగలీలఁ దులఁదూగుచు, విత్తము వెచ్చపెట్టుచున్
నీచుల నమ్మి మోసపడి నిస్పృహఁ గుందుచు సంచరించెడున్. 519

చేత ధన మున్నదని గ్రహించిన జనమ్ము
చేరి యుబ్బించి సిరులు కాఁజేసి చనియె;
మిగిలె నాతండు నీరము లిగిరి చన్న
మడుఁగు లోపలి చేఁప సామ్యమునఁ గడకు. 520

దానికిఁ దోడు వచ్చిపడెఁ దద్భువి క్షామము, వృష్టివేళలన్
వానలు లేవు, వాగులును వంకలు నింకెను, పంటపోయె, దా
హానకుఁ జుక్క నీర్ దొరకుటన్నది దుర్లభమయ్యెఁ బ్రాణిసం
తానము డస్సె, భిక్షుకజనంబులు హెచ్చిరి నాఁటినాఁటికిన్, 521

పొట్ట గడవక యా కొడుకు కెట్టకేల
కొక్క పశుపాలకుని సేవ కొప్పి కుదిరె-
అతఁ డొక ముద్ద పెట్టించు, నతని పంది
కదుపులను దాను పెన్నాడి కావవలయు. 522

ఆ ముద్ద వాని డొక్కకు
నే మూలకు రాక యితరు లెఱుఁగక యుండన్
దా మెసవుఁ బందులకుఁ దత్
స్వామి తినం బంపినట్టి జావయుఁ దవుడున్. 523

పందుల కొట్టముల్ చివికి పాడయినన్ దగనల్లి, మేఁత లం
దుం దినిపించు బొచ్చియలఁ దోముచు, మూత్రశకృత్తు లెత్తుచున్
బందుల చెంతనే నడుము వాల్చుచు లేచుచు, దోమకాట్లకుం
గుందుచుఁ గుట్టఁ డీడ్చె బ్రతుకున్ దదవగ్రహ ఘోరదుర్దశన్. 524

అప్పుడప్పుడు తన గ్రామ, మచటి చెల్మ
లచటి సుఖములు, తన తండ్రి యాదరణము
తలఁపునకు వచ్చి బలు మనస్తాపమునకుఁ
జొచ్చుఁ ద్వరపడి చేసిన పిచ్చిపనికి. 525

గాలి మళ్లెఁ దండ్రిపై-లేచె నతగాఁడు
డాసె దొరను, సెలవు దీసికొనెను,
వచ్చినట్టి త్రోవఁబట్టి పశ్చాత్తప్త
చిత్తుఁ డగుచుఁ దండ్రిఁ జేర నరిగె. 526

నడచి నడచి యొక్క నాఁటి యొట్టిని యెండ
వేళ కిల్లు చేరెఁ బిల్లవాఁడు
తండ్రి చూచి యశ్రుధారలు దొరలంగఁ
గొడుకు నెడఁద కత్తుకొని వచించె. 527

"వచ్చితి వీవు ప్రాణములు వచ్చెను బొందికి, విందువేడుకల్
ముచ్చటఁ జేయఁ బంచెద నపూర్వము నద్భుత మత్యుదారసం
పచ్చతురంబుగా, నివుడ బంధులమిత్రులఁ బిల్చివచ్చెదన్
దెచ్చెద నూత్నకాంతి గృహదేహళిఁ దోరణభూషణమ్ములన్" 528

అని మాంసమిశ్రబహుభో
జనములు గావింప, మధురసంబు లొనర్పన్
దన గృహ మలంకరింపను
బనిచెన్ సేవకులఁ గార్యవహనఘటికులన్. 529

పొలము పుట్ట యరసి ప్రొద్దు వాటారెడు
వేళ కిల్లు చేరెఁ బెద్ద కొడుకు;
ఇంటి నిండ నొకటె యేమేమొ సందడి
"యేమి ?" యనుచు నడిగె భృత్యు నొకని. 530

వాఁడు వచించెఁ "దమ్ము లిదె వచ్చిరి, నాయనగారు విందులన్
వేడుక లొల్లొనర్ప మముఁ బెట్టిరి, క్రొవ్విన దూడ నేరి తు
న్మాడిరి, పాచకుల్ బహువిధాన్నములన్ సమకూర్చుచుండి రి
వ్వాడను వారివీరిఁ గొనివచ్చుటకై పిత యేఁగి రిప్పుడే". 531

ఆ మాటల్ విని యన్న బాధపడె ని "ట్లౌరా జగం ! బేఁ బితృ
స్వామిన్ రేఁబవ లంటిపెట్టుకొని సేవల్ చేసితిన్ నా పయిం
బ్రేమల్ జూపెనె ? నన్ను మెచ్చెనె యొకప్డే? నిట్లు నన్గూర్చి హ
ర్షామోదంబులు వెల్లడించి గృహమం దార్భాటముల్ చేసెనే?" 532

పిలుపుల కేఁగివచ్చెఁ బిత, పెద్దకుమారుని మోముచూచి ని
శ్చలుఁ డయిపోయె; నాపికొనఁ జాలని రోషము నిస్సహాయదు
ర్బలత కవోష్ణబాష్పముల రాల్చ బయల్పడి యేడ్చెనన్న, తాఁ
దెలిపె నిజాంతరప్రణయదృక్పరమార్దము తండ్రి వానికిన్. 533

"తప్పిపోయినట్టి తనయుండు దొరకెను
చచ్చి కొడుకు బ్రతికి వచ్చినట్లు
ఇంతకంటె మనకు సంతోషపడఁగల
యదను గలదె ? యెఱుఁగ వైతి పుత్ర ! 534

త్వరపడి తమ్ముఁ డేదొ పొరపా టొనరించె నిజమ్ము భ్రష్టుఁడై
తిరిగెను, పాప మీ దినము దీనముఖమ్మున నాశ్రయించి యా
దరణముఁగోరె నన్ మగుడఁ దండ్రిని నేను క్షమింపకున్న నె
వ్వరు క్షమియింత్రు ? నీ వలెనె వాఁడును బిడ్డఁడు కాకపోయెనే !

నీ వనిన నెప్పటికి మ
ద్భావంబున నిండియుండు వత్సలత సుతా!
త్రోవను దప్పిన బిడ్డని
దేవలదే మార్గమున కధికసంప్రీతిన్!'' 536

వ. అని చెప్పి యా తండ్రి చిన్నకుమారుని క్షమించి తన యండను జేర్చుకొనియె. కావున, 537

దుశ్చరిత్రుఁడయ్యె నెవ్వఁడు
పశ్చాత్తాపపడి స్వామి వంకకు మరలున్
నిశ్చయము వాని సర్వే
శ్వరుఁ డగు తండ్రి నిండుదయ మన్నించున్. 538

వ. అని యిట్లు మేనల్లుండు వివరించె. కొన్ని దినంబుల నుండి శ్రీమద్భగవద్గీతాస్వాధ్యాయతత్పరుండై యున్న యొక్క యుద్యోగి బ్రహ్మవేత్త నిట్లడిగె. 539

నా యీ శంకను దీర్పుఁ డర్జునునకున్ వ్రాకుచ్చె శ్రీకృష్ణుఁ డా
ర్యా! "యజ్ఞంబులచేత నేర్పడును బర్జన్యంబు, లవ్వానిచే
నీ యన్నంబులు పుట్టుచున్న''వని, నేఁ డెవ్వారు యజ్ఞంబులం
జేయంగానము, మేఘసృష్టి యగు, వర్షించున్ బొలాల్ పండెడున్,

ఇది యెట్లు తెలుపుఁ డం చెఱుఁగఁ బ్రశ్నింప
ముదమునఁ జెప్పె నప్పుడు బ్రహ్మవేత్త, 541

-: యజ్ఞము రెండు విధములు :-

వైదిక లౌకిక సంజ్ఞా
భేదంబుల యజ్ఞ మనఁగ ద్వివిధము, ఋత్విక్
చోదితము వైదికము, భజ
నాదిక మర్చనలు లౌకికాఖ్యఁ దనర్చున్. 542

గృహదేవతార్చనలు న
న్వహబహుదేవాలయార్చనాదికశుభని
ర్వహణము లౌకికయజ్ఞని
వహమే: యట్లగుట నేఁడు వఱలుం గ్రతువుల్. 543

ఆ క్రతువులు దివిఁ బర్జ
న్యక్రమ సంస్థాపకమ్ము లగు, నన్నోత్ప
త్తిక్రియ నడచును జలముక్
చక్రమ్ములు కురిసి వృష్టిసమయముల నిలన్. 544

వ. ఇట్టి ద్వివిధయజ్ఞంబులు భారతంబునం జెప్పంబడె. ఇంకేమి వినఁదలంతు వడుగు మనిన నయ్యుద్యోగి యధ్యాపకునితో మరల నిట్లనియె. 545

-: ఆకాశవాణి పలుకుట, శాపములు నెరవేరుట :-

"భారతము నందు నశరీరవాణి పలికి
నట్లు, శాపముల్ నెఱవేరి నట్లు కలదు.
ఔర నోర్లేని నభము మాటాడు టెట్లు?
శాప మిచ్చిన ననుగతి జరగు టెట్లు? 546

వ. అని యడిగిన నయ్యధ్యాపకుం డిట్లు సెలవిచ్చె. 547

అది యుగధర్మమౌ, యుగమఁటన్నది కాలవిభాగ మెల్ల వే
ళ దినము లొక్కపోలికఁ జెలంగవు, ద్వాదశమాసవర్షమం
దొదవు విభిన్నతత్త్వగుణయుక్తము లైన దినంబు లెండకా
లదశయు, వానకాలదశ, ప్రాకటశీతదశల్ ఘటిల్లవే ? 548

ఎండకాలమునం బుట్టి యెండకాల
మందె గిట్టెడు పురుగు, మేఘార్భటులును
కుంభవృష్టులు, శైత్యప్రకోపములును
కల వనిన విశ్వసింపని గతి నరుండు 549

కలిని జనియించి కలి మట్టిఁగలియు నతఁడు
కృతయుగపు లక్షణంబులు, త్రేతలక్ష
ణములు, ద్వాపరయుగలక్షణములు నైన
నభము పల్కుట, శాపోక్తి నమ్మ లేఁడు. 550

వ. శకుంతలా వృత్తాంతంబె తీసికొనుఁడు ! అం దాకాశవాణి పలికినదా లేదా యని తర్కించుకొనుట కంటె సత్యవాక్ ప్రాధాన్యంబు గ్రహించుట లక్ష్యంబు కావలె. ఇంకేమి యడుగఁ దలంతు రడుగుఁడు !" 551

అనినన్ శ్రోతలలోని కౌతుకి యొకం డాచార్యుఁ గోరెన్ "మహా
త్మ ! నరుం డేవిధి జీవితంబునఁ గృతార్థత్వంబు సాధించు ? నా
తని దైనందినవృత్త మెట్టునికి మేల్ ? తత్తద్విశేషార్థముల్
వినిపింపం దగు నేర్చికొందుము భవత్ప్రత్యుక్తబోధమ్మునన్'' 552

-: అహింసయే పరమధర్మము :-

దానికి బ్రహ్మవేత్త ప్రమదంబున నిట్లనె "సర్వధర్మసం
తానమునం దహింస యను ధర్మము మించిన ధర్మ మన్యముం
గానము, వేదవాక్యమిది, కావున మానవుఁ డెట్టిహింస యే
ప్రాణికిఁ జేయకుండ నడవన్ సుఖియించు సమస్తలోకముల్. 553

-: క్షీరసంబంధులను త్యజించి జీవించిన సచ్ఛీలి చరిత్ర :-

మన వలె సంసారంబున
మునిఁగియు జీవములయెడ నపూర్వదయాదృ
ష్టి నెఱపి నెగ్గిన యొక వి
పుణిని నేఁ జూచితిని వింత పోకడ యతనిన్. 554

వ. అతని వృత్తాంతంబు విన్పింతు వినుండు : 555

ఆ పాఱుఁడు మరిడమ దే
వీ పరమావాసవిశ్వవిశ్రుత మగు పె
ద్దాపురమునఁ జిరకాలము
కాఁపురమై యుండె దీక్షగాఁగొని మనికిన్. 556

వ. అతం డొక్క బక్కపల్చని మానిసి. పేరు వేంకటే
శ్వరులు. 557

చిన్ననాఁట గ్రామసీమను బొరుగిండ్ల
కృషికు లావుఁ గట్టి గేదెఁ గట్టి
పాలు పితికికొనెడు భంగిని గని వాని
కనులు చెమ్మగిలని దినము లేదు. 558

చేపు దెప్పించు కొఱకు కొంచియము సేపు
దూడ వదలెద రావు పొదుంగు దరికి
చేపు వచ్చెన ః దూడ నీడ్చికొని పోయి
గుంజకుం గట్టి పాల్ పిండుకొంద్రు తాము 559

తల్లి పొదుఁగు వదల నొల్లక దూడయు,
దూడ వీడ లేని జాడ గోవు,
మనుజ రాక్షసులకు మాఱాడ నేరక
నిస్సహాయదశను నిలిచి చూచు. 560

"అమ్మా చూడవె వీఁ డెవండొ నిసుడాయన్వచ్చు నన్ బల్పు కం
రమ్మంఁదున్ బిగియించి యీవలకు నీడ్వంజొచ్చెఁ గంఁతాన గా
యమ్మై నొచ్చెడు" నంచు దూడ యనఁ "గట్టా ః నన్నిటం గట్టినాఁ
డమ్మా నిన్నెటు చేరనేర్తు?" నను చయ్యావేడ్చు పుత్రార్థమై 561

"బుడుతవాని కింత కడుపారఁగాఁ బాలు
త్రావ నొసఁగ లేని తల్లి నైతి
నాకు బిడ్డనికిగ ః నరుఁ డడ్డపడి వచ్చి
క్షీర మొడిచి సొమ్ము చేసికొనును". 562

అనుచున్ ధేనువు తల్లడిల్లుగతి, "నా కాహారమై యున్న పా
లను నన్నీవలికీడ్చి యున్నరుఁడు క్రోలఁజొచ్చె: నా యాఁకటిం
గనిపెట్టంగల నాథుఁడెవ్వఁ" డను దుఃఖగ్లానిచే దూడ యే
డ్చునటుల్ గన్పడి వేంకటేశ్వరులు రాల్చున్ జాలికన్నీళులన్. 563

అపు డొక నిశ్చయమ్మునకు నమ్మహితాత్ముఁడు వచ్చె "సృష్టిఁ ద
ల్లి పొదుఁగులోని క్షీరములు లేఁగలు త్రావునిమిత్తమే. నరుం
డపమతిఁ దెల్వితేటలు బయల్పడ దూడల పొట్టఁగొట్టి తా
ను పితికి త్రావనేర్చె నెదనుం గణియింపక పాపకర్మగాన్. 564

నే నీ పాపభరమ్ము గట్టుకొన, మేనిం బ్రాణముండంగఁ బాల్
గానీ, వెన్నయుఁగాని నేయి, దధి తక్రంబేని, తన్మిశ్రపుం
బానీయమ్ములుగాని ముట్ట" నని యప్పాఱుండు ధీరప్రతి
జ్ఞానిష్ఠాదృఢచిత్తుఁడై కడపె దీక్షన్ మృత్యుపర్యంతమున్. 565

వ. అతఁడు జీవించి యున్న దినములలో నేను పెద్దాపురము వోవఁ దటస్థించి, యమ్మహానుభావు దర్శించి ప్రసంగవశంబున నిట్లడిగితి. 566

"అయ్యా తమరఁట పాలును
నెయ్యియు మజ్జిగయుఁ దిండినిం గొనరఁట, మీ
కియ్యాలోచన పుట్టఁగ
నెయ్యది కారణము చెప్పరే ?'' యని యడుగన్. 567

అతండిట్లనె "నేమిచెప్పవలె ? నా కన్పించె దేవుండు గో
మాతన్ స్తన్యము దాని బిడ్డ భుజియింపన్ మాత్రమే కూర్ప ద
ర్పాతిస్వార్థమతిన్ భుజింప మన మిట్లాయత్తమైనార మం
చేతత్కారణమై త్యజించితి నయా ! యీ క్షీరసంబంధులన్. 568

దూడ నోరు గొట్టి దుగ్ధమ్ము గ్రోలుట
జీవహింస యనుచుఁ జెప్పె మనసు
కనుక మానినాఁడ'' ననిన విప్రుని యంత
విడువకుండ మరల నడిగితి నిటు. 569

"మీరు దినము దినెడి కూరగాయల యందు
జీవ ముంట లేదె చెపుఁడ ! వానిఁ
గోసి వండి తినుట దోసమ్ము కాదొకో
యింత కదియు జీవహింసయె కద !'' 570

వ. అనిన నా ప్రశ్నంబు విని యా బ్రాహ్మణుం డిట్లనియె.

"ఇదిగో ఈతను వెట్టువచ్చెఁదొకానీ వచ్చె నిద్దానియం
దొదిగెం బ్రాణము, ఱీ శరీరమును బ్రాణోపస్థితుల్ నా యధీ
నదశన్ లేనివి; వాని నిల్పుకొను యత్నంబందు నేఁ గోసి వం
డెద నిక్కాయల, జీవముండెనని, వింటిం గాయలం గూరలన్. 572

ఇంతకు మించి సుళ్వయిన యింకొకమార్గముఁ జెప్పఁ డట్లె శి
వింతును, దేహమెట్లొ నిలఁబెట్టుకొనన్ గతి వేఱె లేక "మీ
గొంతులు గోయుచుంటి" నని కుందుచుఁగోసెద, సంతసింప నా
వంతయుఁ బ్రాణమందుఁగల యాశ జయింపఁగలేని మర్త్యుఁడన్.

అతఁ డట్లు చెప్ప ననుచు నూహింపని
నే నిరుత్తరుండనై నిలిచితి;
భూసురుండు పెరటి మొక్కల కదె నీరు
వోయలేచె, వెంటఁ బోయితి నటు. 574

తులసిమొక్కలు, నాకు కూరల మడులును
పాదు లేవేవొ పఱలు నవ్వాని పెరట,
వాని కుదుళుల నీళులు పట్టునట్లె
చిలుకు జలములు పిచ్చిమొక్కలకుఁ గూడ. 475

"అవి యేమి మొక్క" లని నే
నవనీసురు నడుగ నాతఁ డనె "నివియా? యే
వెవొ పిచ్చిమొక్క, లిట్టి క
సవులకు నీరేల యనెడి శంక గలిగెనే? 576

ఆ యా పాదులు చేసికొన్న ఘనపుణ్యంబేమి? యీ వెఱ్ఱివౌ
నా యీ మొక్కలు చేసికొన్న యఘమే? మా మళ్లకున్ నీరు నేఁ
బోయన్ జూచుచు నీ యనాయికతృణంబుల్ 'రమ్మిటున్రమ్ము! మా
కూయాలింపుము! మాకుఁగూడ నిడుమీ గ్రుక్కెండు నీరంబులన్'

అని నాదెస దీనంబుగఁ
గని యర్థించుచు నున్నయట్లు కన్పడుఁ బట్టుం
డని వానికినిం బోసెద
నొనరం గాదనక దేవుఁ డొసఁగిన జలముల్". 578

ఇట్టు లా విప్రమఃణి వచియించె సాధు
సరళ సుకుమార వరమనః పరిణతోక్తి-
'ఇట్టి పురుషులు కలిసుండి రింక' ననుచు
మాఱు మాటాడ నేరక మరలి నాఁడ. 579

-: శీలవంతుని దినచర్య :-

వ అది యట్లుండె. చేతనై నంతవఱ కన్యులకుఁ గీడు సలుపకుండుటయె దొడ్డ శీలంబు. 582

తెలిసి యితరుల కొక కీడు తలఁప రాదు
తలఁచి తేనియు ననువృత్తిఁ బలుక రాదు
పలికి తేనియు ననురీతి సలుప రాదు
తలఁపు పలుకుల కంటెఁ జేఁత యధమంబు. 581

మిము సృష్టించిన సర్వలోకమయు నెమ్మిన్ నిత్యకార్యజ్ఞభా
వమునం గొల్వుఁడు, సంస్మరింపుఁ డతనిన్ ప్రాతస్సముత్థానకా
లమునన్ రాతిరి శయ్యపై కొరగువేళన్; రెండు పద్యంబు లీ
క్రమమందుం గల వే మహాకవియొ వక్కాణించె వల్లింపుఁడీ ! 582

వ. ఉదయము నిద్రలేచునపు డిది పఠించుకొనుఁడు. 583

నిరపాయముగ రాత్రి నిద్రాసుఖం బిచ్చి
కరుణతో మమ్మెల్లఁ గాచినావు
చీఁకటు లడఁగించి చింతల మఱపించి
తెలివొంద మమ్ము బోధించినావు
బడలియుండిన మేని బహువిధాంగములకుం
బుష్టి నొసఁగి కృపఁ బోషించినావు
మఱల దైనికయాత్ర మహి మేము మొదలిడన్
సకలమ్ము సిద్ధంబు సలిపినావు

వెడలువార మయ్య విశ్వేశ! నీ యాజ్ఞఁ
దలను దాల్చి జనహితమ్ము నెంచి,
దేవదేవ! మమ్ము దీవింప రావయ్య!
ప్రణుతి సేతు మయ్య భక్తి నీకు. 584

వ అట్లే రాత్రి శయనించు వేళ నిట్లు చదువుకొనం దగు.

నిఖిలవస్తువు లందు నిండియుండు ఘనుండ!
జీవుల కాత్మయై చెలఁగు వాఁడ!
ఓ పరంధామ! నే నొగి మేల్కొనిన దాది
తిరిగి యిచ్చటఁ జేరు వఱకు నేఁడు
నాలినాక్ష! నా వాఙ్మనఃకాయముల చేత
నెఱిఁగి యెఱుంగక నెఱపినట్టి
సుకృతదుష్కృతముల నకలంకరూప! నీ
కర్పణ చేయుదు నఘవిదారి!

ఇపుడు నిద్రింతు నిన్ను నా యెదను నిల్పి
తిరిగి మేల్కొన్న తటిని సత్కృతులఁ జేయ
బుద్ధి నాకిచ్చి కిల్బిషంబుల నడంచి
నన్ను నీ సన్నిధికిఁ జేర్ప సన్నుతింతు. 586

వ. మఱియును 587

అఖిల యజ్ఞమ్ములన్ జపయజ్ఞమునకు
మించినది లేదు. కావున మీ వలచిన
యిష్టదైవమ్ము నెద జపియింపు డెపుడు
నే జపించెద శాంకరీ బీజశక్తి. 588

వ. ఇట్లు బ్రహ్మవేత్త సాధుచిత్తంబునం దెలిపి యింకను నేమి వినవలతురు ప్రశ్నింపుఁ డనినఁ దత్సన్నిధానోపవిష్టుండై యాలకించుచున్న యొక్క గృహస్థుండు బ్రహ్మవేత్త నిట్లు ప్రశ్నించె. 589

"స్వామీ! వచ్చిన దాది మమ్ము నిటులన్ బ్రశ్నింపుఁ డింకేమి యిం
కేమి మీరు వినందలంతు" రనుచుం బృచ్ఛించుచున్నారు, మా
కేమో తొందరపాటు మీ నుడులఁ గన్పించున్ గతంబేమి? నేఁ
డే మా సంశయచక్రమున్ దునుమ మీ రిచ్ఛింతు రిట్లేలొకో?"590

:- బ్రహ్మవేత్త తీర్థయాత్రాసంకల్పము :-

నావుడు బ్రహ్మవేత్త వదనంబున నాదరమందహాసరే
ఖావిహృతుల్ సెలంగ ననె గ్రామజనుల్ విన "నేను తీర్థయా
త్రావశబుద్ధిఁ బుణ్యభరతక్షితి వర్ధిలు క్షేత్రదర్శనే
చ్ఛావిధి జేపొమాపొ చను సన్నహనంబున నుంటిఁ గావునన్. 591

తెలిసిన నాలుగు ముక్కలు
తెలియం దలఁపున్న మీఁకు దెలిపి చనుటకై
పలుమాటిట్లడిగితిని, మ
రల నెప్పుడు తిరిగి రాఁగలనొ నే నెఱుఁగన్. 592

శ్రీశైలం బను క్షేత్రరాజమును దర్శింపన్ దెగున్ మోహపుం
బాశం బంద్రడు, మఱట్టులే తెగిన యావజ్జీవ మచ్చోటనే
శ్రీశైలభ్రమరాంబికం గొలుచు దృష్టిన్ నిల్తునో! మోహపుం
బాశంచే బలవత్తరం బయి యిటీశ్వన్ గ్రమ్మఱన్ వత్తునో! 593

ఎవని కెఱుక భగవదిచ్ఛ యెట్లున్నదో
యట్ల నడచుఁ దీర్థయాత్ర లందు
మనసు దవిలియుండె, మనవారి మనయూరి
విడువ లేను విడువ కుడుగ లేను. 594

అనుచుం గన్నుచెమర్ప బ్రిహ్మవిదుఁ డట్లాశోత్రివర్గంబుఁ గ
న్గొని వీడ్కోలు నొసంగి పంపుఁడనుచుం గోరంగ నా వృద్ధమి
త్రనికాయం బెదురాడ నోడి యని "రోతండ్రి! సరే, మేము కో
రున దొక్కండె, యనుగ్రహింపుఁడు కృతార్థుల్ గాఁగ మీశిష్యులున్.

తమ రే దేవుని ముందు మోకరిలి శ్రద్ధన్ బ్రార్థనం జేసినన్
మముఁగూడన్ దలపెట్టుఁ డొక్కపరి నాత్మన్, మా స్పృహల్ మీ పవి
త్రములౌ ప్రార్థనలందు నల్లుకొని చేరన్నేర్చుఁ దత్తత్పభూ
త్తమపాదాంతికతీర్థభూముల కహో ధన్యంబులౌ జన్మముల్. 596

— 0 —

శ్రీ గాడేపల్లి మల్లికార్జున సుబ్బాంబా కుమార కుక్కుటేశ్వర
ప్రణీతం బయిన ఆనందవల్లి లోని-పంచమాశ్వాసము ముగిసినది.

# నివేదన

చర్ల బ్రహ్మయశాస్త్రి సన్నిధిం జదివితి
తిరుపతి వేంకటేశ్వర కవీంద్రు
లవ్వారి సన్నిధి నధ్యయనించెం బిం
గళి లక్ష్మీకాంత మన్ కవివరుండు
వారి సన్నిధిని దివాకర్ల శ్రీ వేంక
టావధాని మనీషి యభ్యసించెం
దన్మహామహు సన్నిధానంబునం జేరి
యేం బఠించితిం గుక్కుటేశ్వరుండ

నిట్టి బహుపుణ్యలబ్ధ సాహిత్యగురుత,
నన్నపార్యాదికృతి నిరంతరసమీక్ష,
తల్లిదండ్రుల కావ్యనిత్యపఠనమ్ము
కలిసి నన్ను శివాజ్ఞగాం గవి నొనర్చె.

కవినై నందుల కూరకుండక యెవో గ్రంథంబులన్ వ్రాసి, య
ష్టవధానంబు లొనర్చి, యాశుకవితాసందర్భముల్ సూపి, తీ
రవు కబ్బంబు నొకండు చెప్పవలె నన్ స్వాంతంబునన్ నేను వి
న్నవియుం గన్నవి కూర్చి చెప్పితి నిటే యానందవల్లిన్ గృతిన్.

నాకుం గవిత నేర్పినాండవు, నీ నేర్పి
నట్టి కవిత నీకె యర్పణమ్ము
చేసికొంటిం గృతిని జెవివెట్టి తుదిదాంక
వింటి వంతె చాలు విశ్వనాథ!



*

చెట్టుముందా విత్తు ముందా?

పునర్జన్మలూ జన్మానుబంధాలూ ఉన్నాయా?

మంత్రాలకు చింతకాయలు రాల్తాయా?

మంత్ర సిద్ధి - అంటూ ఉన్నదా?

ఆకాశవాణి పలకడం ఏమిటి?

దేవుడు ఉన్నట్లా లేనట్లా?

కలలు ఎందుకు వస్తాయి?

గుడికి వెళ్ళి లెంపలు వాయించుకుంటే
దేవుడు క్షమించేస్తాడా?

కూరగాయలు కోసి వండుకు తినడం
జీవ హింసకాదా?

- వంటి అనేక ప్రశ్నలకు సమాధానం
ఈ కావ్యం.

కావ్యం : **ఆనందవల్లి**

కవి : **గాదేపల్లి కుక్కుటేశ్వరరావు**

రూ. **35/-**